# దేవుని జీవితం

[ అవీ - ఇవీ - అన్నీ ]

గోపీచంద్

సూత్రాశ్రమం, తెనాలి.

ఇతర రచనలు

పట్టాభిగారి సోషలిజం

ఆడమళయాళం

భార్యల్లో నే వుంది

దేశం ఏమయ్యేటట్టు?

ఉభయపక్షలోపర

మొదటికూర్పు
ఫిబ్రవరి, 1943
రెండవ కూర్పు
మే, 1943



రూ పా యి

# దేవుని జీవితం

"దేవుడున్నాడా, లేడా?" అనే ప్రశ్న పాతబడిపోయింది; యీ రోజుల్లో ఈ ప్రశ్న వేస్తే రసాయనశాస్త్రజ్ఞులు, "భగవంతుడు అనవసరంగా సృష్టింపబడ్డ తార్కికుల ఊహామాత్రుడు," అంటారు. నవనాగరికులం అనుకునేవాళ్లు, "ఇన్నాళ్ళనుంచీ ఏం చేస్తున్నావురా అబ్బాయ్; యిప్పుడు లేచావ్?" అంటారు.

"15వ శతాబ్దం దగ్గరనుంచీ యీ విషయం ఆలోచించేవాళ్లే లేరు. అప్పటికప్పుడే షేక్స్పియర్ గారికి దేవుడు లేడు," అన్నది షాగారి, కారవాన్ ఆఫ్ ది క్యూరియస్ లోని, వొకపాత్ర....

ఒక నల్లమ్మాయి దేవునికోసం వెతకటం ప్రారంభించింది. ఏం చేస్తే దేవుడు కనపడతాడని విన్నదో అవన్నీ చేసింది. ఎక్కడ దేవుడు వుంటాడని విన్నదో అక్కడికల్లా వెళ్ళింది. ఒక రోజు ప్రయాణంచేస్తున్న ఒక గుంపుని చూచింది.

"మీరు వెతికేది దేవునికోసమా?" అని వెంటనే అడిగింది. వాళ్ళాపరిహాసానికి డొక్కలు చెక్కలయ్యేటట్లు నవ్వుకున్నారు. నిద్రించేవాళ్ళు మేల్కొని "ఏమిటి?" అని అడిగి ఆ అమ్మాయి చిత్రమైన ప్రశ్నవిని, అందరూ కలిసి గగ్గోలుగా నవ్వుకున్నారు. "పిచ్చిపిల్ల! ఎప్పటి దేవుడూ, ఎప్పటి కథా!" అని ఆశ్చర్యపడ్డారు.

కాని యిన్ని సంగతులు తెలుసుకున్న నేనుకూడా దేవుడున్నాడా? అనే ప్రశ్న వేసుకొని సమాధానం చెప్పటానికీ, చెప్పుకోటానికీ ప్రయత్నిస్తాను. దేవుడున్నాడు—ప్రతియుగానికీ దేవుడున్నాడు—ఒక్కొక్క యుగానికి ఒక్కొక్క దేవుడు.

మృగదశలోవుండి, మాంసాహారులై, చెట్టుగుట్టల చుట్టూ దిమ్మతిరిగిన మన పూర్వులకు దేవుడున్నాడు. సైన్సు వృద్ధి పొందిందీ, దాని ధాటీకాగలేక దేవుడు సెలవుతీసుకుంటు న్నాడూ, నిష్క్రమిస్తున్నాడూ, అని విర్రవీగే మనకు దేవు డున్నాడు. కాని ఘోజ మెక్కడంటే, మన దేవుడు మనపూర్వుల దేవుడు కాదు; మనపూర్వుల దేవుడు మన దేవుడు కాదు. కాలం తోపాటు ఉద్దేశాలు మారుతూ వచ్చాయి. ఉద్దేశాలతో పాటు దేవుడూ మారుతూవొచ్చాడు. కనక, ఇక్కడ నేను దేవుడే విధంగా జనన మొందాడో, బాల్య కౌమారదశలు ఏవిధంగా గడిపాడో, యిప్పుడేవిధంగావుండి, ఎల్లా కాలం 'కృష్ణా, రామా' అనుకుంటూ గడుపుతున్నాడో వర్ణిస్తాను.

*

ప్రథమదశలో మానవుడీ ప్రపంచాన్నీ, ఇందులో జరిగే ఘోరకృత్యాల్నీ, చిత్రవిచిత్రాలనీ చూచి, "చేయబడేమున్న ప్పుడు, చేసేవాడుండాలి. దీనికంతకూ ఎవ్వడో కర్తవుండాలి, ఎవ్వడబ్బా వాడు?" అనే ప్రశ్న గడ్డంమీద వేలువేసుకొని ఆలోచించటం మొదలుపెట్టాడు.

"ఆ! వాడే దేవుడు" అనే సమాధానం వచ్చింది.

సరే యివన్నీ చేయించేవాడు దేవుడు. "ఏమిటి దేవుడు చేయిస్తూ వున్న పనులు?" అనేది రెండో ప్రశ్న. దీనికి జవాబుకోసం మృగదశలోవున్న మానవుని పరిస్థితులు మనం అవగాహనం చేసుకోవాలి; జ్ఞాపకం తెచ్చుకోవాలి. అప్పటి మానవుడు రక్తపువాగుల్లో మునిగితేలుతూ ఉండేవాడు. తన తోటిమానవుణ్ణి చంపటం; కనపడ్డ మృగాన్నల్లా చంప

టం—ఘోరవ్యాధులకు లోనవటం; నరకయాతన అనుభవించటం—పైగా యివన్నీ దేవుడే చేయిస్తున్నాడనే మూఢనమ్మకం. "ఇంకేం? దేవుడు దుర్మార్గుడు" అన్నారు. ఈ దేవుణ్ణే జి. బి. యస్, "నోవాగారి దేవుడు క్రూరదైవం" అన్నాడు. ఈ దేవుడు బలులూ, వేటతలలూ కావాలంటాడు. ఇతణ్నే కవిరాజుగారు

"ముడుపు గట్టినగాని సమ్మోదపడడు
వేటతల జూచిగాని మోమోటపడడు"

అని వర్ణించారు.

ఇతడు మాంసాహారి, రక్తపిపాసి; భయంకరమైన కోరలూ, కరాళవక్త్రమూ గల రాక్షసి. ఇతడు దేవుని కోసం వెతుకుతూ వున్న నల్లమ్మాయినిచూచి, "నేనే దేవుణ్ణి. సర్పంలో వున్న విషాన్ని చేసింది నేను; నీతల్లి రొమ్ములలో వున్న పాలను చేసింది నేను; కాళరాత్రినీ, పండువెన్నెలనూ చేసింది నేను; సృష్టించటం, నాశనం చెయ్యటం నా చేతిలోని పని. ఘోరవ్యాధులకు కారణం నేను; ఉరుములకూ, మెరుపులకూ కారణం నేను; కొసరికొసరి వీచే మలయమారుతానికీ చుట్టుముట్టి సుడిముడిపెట్టే ప్రచండవాతూలానికీ కారణం నేను; నీబోటి వాళ్ళందరూ నాకు నమస్కరించాలి. సాష్టాంగ దండప్రణామ మాచరించాలి. అహోరాత్రులూ నన్ను ప్రార్థించాలి. మిఱుమిట్లు గొల్పే నా తేజస్సు మీరు చూడలేక పోతే, కళ్లు మూసుకొని నన్ను ధ్యానించాలి. కాని యీ సారి నా దగ్గరకు వచ్చేటప్పుడు నీవు హృదయపూర్వకంగా ప్రేమించే నీ సంతానాన్ని తీసుకొనివచ్చి నాముందు తెగనరుకు. కొత్తకొత్తగా ప్రవహించే లేతరక్తం, ఎంతఘుమఘుమాయిస్తూ

వుంటుంది!" అన్నాడు గుటకలు మింగుతూ, చిటికెలు వేస్తూ.

"ఓ! నాకు సంతానం లేదు. నే నవివాహితను." అన్న దా నల్లమ్మాయి.

"అట్లయితే మీఅంత్రీడిని తీసుకొనివచ్చి, నిన్ను నాయెదుట చంపనియ్యి. నీ చుట్టాలందర్నీ వందలకొద్దీ గొర్రెల్ని, మేకల్ని తీసుకొనివచ్చి, నాకు బలి ఇమ్మని చెప్పు. నాకిష్టమైన పనులు చేసినవారి కష్టం నేనుంచుకోను. వారికి—వారి భక్తిశ్రద్ధలకు గాను—మోక్షం కట్టబెడతాను. కాని నేనుచెప్పినట్లు చెయ్యక, పెడదారి తొక్కితే వారికి ఘోరమైన వ్యాధుల్ని కలిపించి, అనేక కష్టనష్టాలను కలిగించి, డొక్క బ్రద్దలు చేస్తాను. నేను దేవుణ్ణని వాళ్ళకు తెలియజేస్తాను," అన్నాడు.

మన ద్రావిడజాతిలోని దేవుళ్ళందరూ యిదేరకం. అంకమ్మా, పోలేరమ్మా, మద్దిరామమ్మా, గంగానమ్మా మొదలయిన గ్రామదేవర్లందరూ ఇదేరకం. కొలువుల పేరుతో నరహత్యలూ, గోహత్యలూ—అమ్మవారి పేరుమీద—విరాఘాటంగా సాగిపోతుంటాయి. అమ్మవారికి ఆకలై రక్తంమీదికి మనస్సుపోయి నప్పుడల్లా మానవుల్లో తామమో, వ్యాధులో కల్పించి, తన కోర్కె వాళ్ళకు తెలియజేస్తుంది. తక్షణం జీవరాసులు కుప్పలై కూలతై; రక్తం వాగులై పారుతుంది. అక్కడితో అమ్మవారి జిహ్వాచాపల్యం అణుగుతుంది.

మనవారి మహాకాళీ విగ్రహం చూస్తే, అప్పటి మానవుల దేవు డెట్టివాడో బోధపడుతుంది. భయంకరమైనమూర్తి; పుర్రెలహారం; బారలు చాచిన కలుకుక త్తివంటి నాలుక; పెద్దవారిని సైతం భయభ్రాంతులను చేసే భీకరమైన చూపులు;

మీదుమిక్కిలి శవాలపైన తాండవ నృత్యకేళి! ప్రథమ దశ లోని మానవుడి దేవుని రూపిది. శివుడు శ్మశానవాసి అని చెప్పి నప్పుడూ, త్రినేత్రుడు అని చెప్పినప్పుడూ, శివునకు పుర్రెల హారముంటుంది; పాముల పేర్లుంటాయి అని చెప్పినప్పుడూ మన పూర్వులు మనకు వర్ణించి పెట్టిందీ దేవుణ్ణే.

క్రమేణ కాలం మారిపోయింది. మానవుడికి విమర్శించు కొనే జ్ఞానం కలిగింది. "ఇదేమి దేవుడు! ఇన్ని ఘోరకృత్యాలీ దేవు డెందుకు చెయ్యాలి ? మానవులు అతని ఆటవస్తువులా ? చిలిపి; రాగాలకూచి; దేవుడు మనతో ఆడుకుంటున్నాడా ? పిల్లికి చెలగాటైతే ఎలుకకు ప్రాణసంకటమని అతడు తెలుసుకో లేడా ? తెలిసికూడా చెయ్యటాని కతని హృదయ మంత శిలా సదృశమా ? అతగా డంత క్రూరుడా? ఇంత కఠినుడు దేవు డెట్లయినాడు ?" అనే సందేహాలు మానవుని దయ్యాలలాగు ముసురుకోవటం మొదలు పెట్టినాయి.

అత డిక ఆపుకో లేక, దేవునిపై గ్రుక్క త్రిప్పుకోనీయకుండా, ప్రశ్నలపై ప్రశ్నలు కురిపించటం మొదలుపెట్టాడు—"తమ రీ పని ఎందుకు చేశారు ? మానవునిచేత యీ వెకిలిపనులు ఎందుకు చేయిస్తున్నారు ?" అని. చివరకు విసిగి, వేసారి, "యీ టెకమక లేల పెట్టెదవు తెల్పగరాదె నిజంబు నీశ్వరా!" అని ప్రార్థించాడు.

కాబట్టి యీ యుగంలోని దేవుడు మానవుని ప్రశ్నలకు సమా ధానం చెప్పుకునే దేవుడైనాడు. తాను చేసిన కృత్యాలకు సంజా యిషీ చెప్పుకునే జవాబుదారీ మనిషైనాడు. కనుక నే యీ దేవుణ్ణి జి. బి. యస్ "వాదం చేతగానివాడు" అన్నాడు. ఈ

దేవుని ఉద్దేశా లివి :—

"నావల్ల భయపడవద్దు. నేను క్రూరుణ్ణి కాదు. నేను హేతువాదిని. హేతువాదంకంటే మరోపని నాకు లేదు. దానికీ నాకే పొత్తు. నా పూజవల్ల లాభంలేదు. నాదగ్గరికివచ్చి, నన్ను నమ్మి, నాకు కోపంరాకుండా. ఏదైనా సంజాయిషీ పెడితే దాన్ని రుచి చూచి నీ విషయం ఆలోచిస్తాను."

"ఈ ప్రపంచాన్ని చేసింది నీవేనా?" అని అడిగింది, ఇతణ్ణి, నల్లమ్మాయి.

"అవును నేనే!" అన్నాడు సగర్వంగా.

"అలాగయితే యీ ప్రపంచాన్నింత దుర్మార్గభూయిష్టమైందాన్నిగా ఎందుకుచేశావ్?" అని అడిగిం దాబిడ.

"అమ్మాయీ, ఎల్లాంటి ప్రశ్న వేశావ్! ఈ ప్రశ్న నీ వడుగుతావనుకుంటున్నాను. సరిగ్గా ఆ ప్రశ్నే అడిగావు. ఆహా, ఎంత దొడ్డప్రశ్న! అహో! ఏమి నీ తెలివితేటలు! ఇంత చిరుతప్రాయములోనే ఇంతటి మేధస్సు ఎల్లా సంపాదించావు! పూర్వజన్మసుకృతఫలమా యేమి? కాని వాక్కుసంగతి, నీ వెవ్వరవు నన్ని ప్రశ్న వెయ్యటానికి? ఏవిధంగా అర్హురాలవు? నీవింతకంటే మంచి ప్రపంచాన్ని చెయ్యగలవా? చెయ్యి చూతాం. ఒక్క చిన్న తిమింగిలాన్ని చెయ్యి. మరి నేనో! తిమింగిలాలను చెయ్యటమే కాకుండా, వాటికి వాసయోగ్యమైన సముద్రాలనుకూడా చేశాను. నీవొక చిట్టెలుకను చెయ్యి చూతాము. ఒక్క చిన్న నీటిగుంటనుచెయ్యి మజా తెలుస్తుంది. కబుర్లుచెప్పటంకాదు. ఇంకాపైగా నా చర్యలను ప్రశ్నిస్తావ్! సప్తసముద్రాలను చేసిననన్ను, రాత్రింబగళ్ళను

సృష్టించిన నన్ను, ఆదిమధ్యాంతరహితుడనైన నన్ను నేడో రేపో, ముసలివగ్గువై, కురూపివై, మరణించబోయే నీవా ప్రశ్నించేది?...ఏమంటావ్? నా ఆర్గుమెంటుకి ఏం జవాబు చెబుతావ్!" అన్నాడు జయోత్కంఠత తెల్పే కంఠస్వరముతో.

"ఇది ఆర్గుమెంటు కాదు. సమాధానం చెప్పలేక గింజుకోవటం," అన్న దాబిడ మొహం చిట్లించుకొని. "నీకు ఆర్గుమెంటు అంటే యేమిటో కూడా తెలియనట్లున్నది."

"నాయంతటివానికే ఆర్గుమెంటు అంటే ఏమిటో తెలియ దంటున్నావ్?...నిన్ను చూస్తే నాకు నవ్వు వస్తూంది బిడ్డా!" అన్నాడు లోలోపల కుళ్లుతూ, బాగా ఉడికిపోతూ.

"నీ నవ్వంటే నాకు లెక్కలేదు—ప్రపంచమంతా కలిసి నవ్వినా నాకు లెక్కలేదు...కాని నే నడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేక తప్పించుకోటానికి ప్రయత్నిస్తున్నావ్? ప్రపంచాన్నంతా మంచిదాన్నిగా చెయ్యక, మంచి చెడ్డలు రెంటినీ కలిపి, యింత ముదనష్టంగా ఎందుకు చేశావ్? నేనే దేవుణ్ణయితేనా, నా ప్రజ లెప్పుడూ పాపాలు చెయ్యరు. ఎందుకు చెయ్యాలి? వాళ్లు నా చేతిల్లో కీలుబొమ్మలుగా వున్నంత కాలం, వాళ్లుచేసిన పనులకు బాధ్యురాలను నేను కాదా? ఈ మాత్రం వివేచనాబుద్ధి దేవుడవై నీ కెలాలేకపోయింది? ఆ మాటకీ వస్తే నీవు పాములలో ఎందుకు విషం పెట్టావ్? ఆ విషం లేకపోతే అవి బ్రతుకలేవనా? మనుష్యులు మరణించలేరనా? నీవు కోతుల్ని అంత కురూపంగానూ, పక్షుల్ని అంత సౌందర్యయుతంగానూ, ఎందుకు చేశావ్? చెప్పు!" అని గద్దించింది.

"ఎందుకు చెయ్యకూడదో చెప్పు?" అన్నాడు నెమ్మదిగా.

"ఎందుకు చెయ్యకూడదా? లేకి బుద్ధి కాకపోతే ఎందుకు చెయ్యాలి?"

"ప్రశ్నలడిగేపద్ధతి యిదికాదు.. అసలు ప్రశ్నలడగటమే నీకు చేతకాదు."

"నా ప్రశ్నలకు సమాధానం చెప్పలేని దేవునివల్ల నాకు ప్రయోజనంలేదు. నేను పోతాను. నీ సంభాషణ విన్నకొద్దీ నిన్ను చూస్తే నాకు విసుగు, అసంతృప్తి జనిస్తున్నాయి. నీవల్ల గడ్డిపోచంత పనైనాకాదు. పైగా, నేను దేవుణ్ణి. యీ ప్రపంచాన్నంతా నేనే చేశానూ, అని విఱ్ఱవీగుతావు. ఎవ్వరు నీ మాటలు నమ్మేది ? ఏమిటి నీమాటలకు దృష్టాంతరం? నీవు తొల్లమనిషివని తెలుసుకోలేక పోవటానికి 'జాబ్' వొట్టి మతి మాలినవాడై వుండాలి. ఈ మహారణ్యంలో దేవుళ్ళమని చెప్పుకు బ్రతికేవాళ్ళు కోటానకోట్లున్నట్లున్నారు."

దీనికి జవాబుగా అతడొక పెద్ద ధ్వనిచేశాడు. నల్లమ్మాయి గాభరాతో మైలు పరుగెత్తి వెనుదిరిగి చూచింది. అలసట తీరింతరవాత మనస్సులో 'పక్షపాతి...కోతిగున్న' అనుకున్నది.

*

కాలం ఎవ్వరికోసం ఆగదు. ఎవ్వరి ప్రయత్నాల్లో వాళ్ళుండగానే దానిపని అది చూచుకుంటుంది. కొన్ని సంవత్సరాలు గడిచాయి, మానవుని చిత్తప్రవృత్తి నానాటికీ మారుతూ వృద్ధిపొందుతూ వొచ్చింది; పూర్వం తనకు తెలియని సంగతులు అనేకం తెలుసుకున్నాడు. దైవ సంఘట్టనాలు అని ఆశ్చర్యంగా చూచే పనుల్ని తానే చెయ్యగలుగు తున్నాడు.

దీన్నిబట్టి దేవుడంటే మానవుని ఉద్దేశం తీవ్రమైన మార్పుకు గురిఅయింది. దేవునికి బలులక్కరలేదు. రక్తమక్కరలేదు. అతడు వేలాది తైలప్రవాహాలు, లేక వర్షాలవల్ల తృప్తిపడ తాడా? లేకపోతే నీప్రథమసంతానం రక్తంవల్ల తృప్తిపడ తాడా? లేక, నీ మానసికభక్తితో సంతుష్టుడవుతాడా? లేక నీ శరీర మాంసంతో సంతోషిస్తాడా? అనే స్థితి దాటింది. "దేవుడు మానవుని ప్రశ్నలకు జవాబులు చెప్పుకోటానికి ప్రయ త్నించే వెట్టిబాగులవాడుకాదు. వెంకన్న, పుల్లన్న ప్రశ్నలకు సంజాయిషీ చెప్పుకోవలసిన బాధ్యత ఆయనయందు లేదు. కాబట్టి న్యాయంగా వర్తించు, భూతదయ కలిగివుండు, అతణ్ణి సమాశ్రయించు' అన్నారు. బైబిల్లోని యీ దేవుణ్ణే జి. బి. యస్ "మీకాగారి దేవుడు" అని వర్ణించాడు. ఈ సంగతే మన బుద్ధుడూ చెప్పాడు. "దేవుడుంటే నీకెందుకు? లేకపోతే నీకెం. దుకు?—ధర్మంచర" అన్నాడు.

ఈరోజునుంచే గొప్పగుణాలు కలవాళ్లందరూ దేవుళ్లుగా పరిగణింపబడుతూ వచ్చారు. ధర్మాత్ములూ, సహృదయులూ దేవుళ్ళయినారు. క్రమేణా ఏగొప్పగుణమున్న వాడయినా దేవు డైనాడు. జబ్బ సత్తువ చూపినందుకు శ్రీరాములవారు దేవుడై నాడు. రాజకీయవేత్త అయినందుకు శ్రీకృష్ణుడు దేవుడై నాడు. దేవుని సంగతే ఎత్తుకోకుండా, జాగ్రత్తగా జారవిడచి, "ధర్మంచర, సత్యంవద" అని మాత్రమే బోధించిన బుద్ధుడు దేవుడైనాడు. "నీ పొరుగువాణ్ణి నీలాగే ప్రేమించు" అని చెప్పి నందులకుగాను ఏసుక్రీస్తు దేవుడైనాడు. "నామాటప్రకారం ప్రవర్తించిన వారికి మోక్షం ప్రాప్తిస్తుంది. నామాట పెడచెవిని

పెట్టిన కాఫరులకు దుర్మరణం ప్రాప్తిస్తుంది,” అని మతము నొక చేతా, ఖడ్గము నొకచేతా పట్టుకొన్న మహమ్మదు దేవు డై నాడు. సత్యాగ్రహంద్వారా, సహాయ నిరాకరణంద్వారా, “యీచెంపమీద కొడితే ఆచెంప చూపెట్టు” అని బోధించి, ఆచరిస్తున్నందులకుగాను గాంధీ దేవుడవుతున్నాడు

“బలులకోసం ప్రజలను హింసించే దేవుని కన్నా, నాతో వాదనకు దిగమని తన భక్తుల్ని ప్రార్థించే దేవునికన్నా, యీ రకం దేవుడే నాకు నచ్చాడు. కాని మరో గొప్ప చిక్కు వచ్చింది. నీకు చెబుతాను. ఆయన చెప్పినట్లే వింటాం. ఆయన అడుగుల్లో అడుగులు వేసుకుంటూ పోతాం. కాని ఎక్కడ కీ ప్రయాణం? గమ్యస్థాన మేది? గమ్య స్థానం తెలియకుండా ‘కానని వాని భంగి’ పూరికే పోతే ఏంలాభం?” అన్న దాబిడ.

“దేవుడే నీకు తోడునీడై దారి చూపెడుతుంటె అతడెక్క డకు తీసుకొనిపోతే నీకెందుకు? అత డెక్కడకు తీసుకొనిపోతే అదే స్వర్గం,” అన్నా డతడు.

“అదెలా? అతను చూట్టానికి నాకు నేత్రాలు ప్రసాదిం చాడు. ఆలోచించటానికీ మెదడు నిచ్చాడు. నేను స్వయం ప్రకాశంగా ఉండాలని ఆయన కోరిక. అట్టిచో, నాకోసం చూచి పెట్టమనీ, నాకోసం ఆలోచించిపెట్టమనీ, నా కర్మను నిర్ణయించి పెట్టమనీ ఆయున్ని నే నెల్లా అడిగేది?” అన్నది.

అతడు మౌనముద్రాంకితు డైనాడు.

*

మరికొన్ని సంవత్సరాలు గడిచినై. మానవుని ఉద్దేశాలు

మారినై. దానితో పాటు దేవుడూ మారాడు
"దేవు డెక్కడవున్నాడు?" అని అడిగిం దా నల్లమ్మాయి.
"నీలో, నాలోకూడ" అన్నాడు ఏసుక్రీస్తు.
"నేనే దేవుణ్ణి," అన్నాడు రామతీర్థ.
"ఇందుగల డందు లేడను సందేహమువలదు. అంతటా ఉన్నాడు. నాలో ఉన్నాడు. నీలో వున్నాడు. మళ్ళీ మాట్లాడితే ఆ స్తంభంలో ఉన్నాడు," అన్నాడు ప్రహ్లాదుడు.
"అంటే ప్రత్యేకం దేవు డనేవాడు లేనట్టేగా?"
"ఉండీ లేనట్టుగా, లేకుండీ వున్నట్టుగా వున్నాడు!"
"సరే; అతగా డెవ్వడు?" అన్న దాబిడ.
"మన తండ్రి"
ఆ అమ్మాయి కొంచెంసేపు ఆలోచించి—
"తల్లెందుకు కాకూడదు?" అన్నది.
పై వేదాంతులందరూ "మే మే;" అన్నారు.
"దేవుడు తండ్రయితేం? తల్లయితేం? మనం వొకరి నొకరు సోదర సోదరీభావంతో ప్రేమించుకుందాం. మన విరోధుల్ని మనం ప్రేమిద్దాం—మనల్ని శపించినవాళ్ళని మనం దీవిద్దాం," అన్నారు.
"ప్రేమే దేవుడన్నమాట!"
"అవును"
"అందరిచేతా ప్రేమింప బడటం నా కిష్టంలేదు. అందర్నీ ప్రేమించటం నా కంతకన్నా యిష్టంలేదు. పాముల విధంగా చంపబడటానికి అర్హులైనవాళ్ళే ప్రపంచంలో అనేకమంది ఉన్నారు. మహమ్మదు అన్నట్లు, 'బ్రతకటానికి బొత్తిగా అన

ష్టాలను మనం చంపివెయ్యాలి.' తోట వృద్ధిచెంది ఫల పుష్పా
లను ఇవ్వటానిగ్గాను నీళ్ళు పెట్టాలి, కలుపూతియ్యాలి. అట్టిచో,
విశ్వమానవ ప్రేమ మాటమాత్రమే అవుతుందిగాని కార్యరూ
పేణా చూపెట్టటానికి ఎల్లా వీలవుతుంది? అదీకాకుండా, ప్రేమ
ప్రేమ అంటున్నావ్! ప్రేమ అంత దొడ్డదా యేమి? ప్రేమను
పొగడటమూ, యీ ప్రపంచంలో ప్రేమ లేకపోతే మిగిలేదేమీ
లేదని వాపోవటమూ ఒక వ్యసనమూ, ఆచారమూ అయింది.

ప్రేమకన్నను యెక్కు-
వేముందిరా, యెల్ల
కామ్యపదవులకన్న
ప్రేమ యెక్కు-వరా!
ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
యేమింకవలయురా!

అంటున్నాడు, ప్రతివ్యక్తీ నేడు. కాని నిజంగా ప్రేమ ఇంత
ఉన్నతమైందా? కాదు. ఒకరి నొకరు ప్రేమించటం అంటే
ఒకరినొకరు లోబరచుకోటానికి ప్రయత్నించటం అన్నమాట.
నేను నిన్ను ప్రేమిస్తున్నానంటే నిన్ను తీసివేసి నాలో వొక
భాగంగా చేసుకుంటున్నా నన్నమాట. ఇకనుంచీ నీవు నీకిష్ట
మైన పనులు చెయ్యటానికి వీల్లేదు. నా కిష్టమైన పనులు నీవు
చెయ్యాలి. నన్ను సంతోషపెట్టటానికి నీవు ప్రయత్నించాలి.
నిన్ను సంతోషపెట్టుకోటానికి కాదు. నేను నీకూ నీ వ్యక్తిత్వా
నికీ, నీకూ దేవునికీ మధ్య నిలబడి, నీకు మార్గావరోధం కలిగి

స్తున్నాను. నీ వ్యక్తిత్వానికీ నీకూ సంబంధం లేకుండా చేస్తు న్నాను. నిన్ను నీ దేవుణ్ణి జేరకుండా చేస్తున్నాను. ఇది చాలా నిరంకుశమైన పని ప్రేమ మానవుని అమాంతంగా మింగివేసే ఒక భయంకర మాయామృగం! అసలు సంగతి ఇదైతే, కవు లందరూ ప్రేమను కీర్తించి ఆకాశాల్లోకి లేవనెత్తి, అమాయిక హృదయులను ప్రపంచానికి పనికిరాని అశాక్యులనుగా తయారు చేస్తున్నారు. 'నాది, నేను' అనే అహంకారాన్ని చంపి మాన వుని ఏపని చెయ్యటానికీ శక్తి లేని జీవచ్ఛవంగా చేస్తున్నారు. దీని వల్ల ప్రపంచం ఎంత అధోగతికి పోతుందో తెలుసుకోలే కున్నారు. అందుకనే కవులువ్రాసిన పద్యాలను చదువుకొని ఆనందించవలసిందే గాని, వాటిని శిలాక్షరములుగా తీసుకొని ఆచరణలో పెట్టగూడదు. వారి తలలు ఆకాశంలో ఉంటాయి; పాదాలుమాత్రం భూమిమీద ఉండవు," అని ఉపన్యసించిం దాబిడ ఆవేశంతో తూలిపోతూ!

ప్రేమ—దేవుడు నిలువుగుడ్లు వేశాడు.

*

కాని కాలం మారినకొద్దీ, యీ 'ప్రేమే దేవుడు' అనే ఉద్దేశంకూడా కాలప్రవాహంలో బుటక వేసింది. కాలప్రవాహం రాపిడికి యీ ఉద్దేశాలా ఆగేది! మానవుడు ఆదాం అవ్వల నుంచి రాలేదు; దేవుని మొహంలోనుంచీ, ఊరుభాగంలో నుంచీ, పాదాలలోనుంచీ కాదు వచ్చింది అని తేలింది. కోతు ల్లోనుంచి వచ్చారని నిర్ధారణయింది. దేవుడెవ్వడు? నిరాకా రుడు, నిరంజనుడు అని మొదలుపెట్టారు. దేవుడేవడు? అనే ప్రశ్నకు ఏ యే వస్తువు దేవుడు కాదో చెప్పటం మొదలుపెట్టారు.

కాని దీనివల్ల తేలే దేమున్నది ?

"గోపీచంద్ ఎవ్వరు? అనిఅడిగినప్పుడు 'గోడ కాదు,' 'నక్క కాదు,' 'పిల్లి కాదు,' 'గోంగూర కాదు,' అని చెప్పకుంటూ పోతే గోపీచంద్ ఏమిటో తేలేదెప్పుడు?" అని ప్రశ్నించింది నల్లమ్మాయి. దీనికి జవాబు చెప్పలేక యే పేచీ లేకుండా, 'పిపీలికాదిబ్రహ్మపర్యంతం ఆవరించుకొని వున్నదీ పరబ్రహ్మం' అన్నారు వేదాంతులు.

ఏది చరాచరంబయిన సృష్టికి సర్వము మూలకారణం
బేది మునీశ్వరప్రతతి కేని యగోచరమైన దొడ్డ వె
ల్గేది అయాంతమం దయిన నించుక వైకృత మందకుండు
అట్టి నిత్యసత్యపరతత్వ మహాత్వమే దేవుడన్నారు నేటికవిరాజు గారు. ప్రపంచానికి అంటకుండావుండి దాన్ని నడిపిస్తూవున్న ఒక మహాశక్తి; జీవశక్తి; పరిణామోత్సాహంగల నిర్నిరోధమైన యీశక్తి దేవుడంటున్నారు బెర్నార్డుషా మొదలయిన మెట్ట వేదాంతులు.

"ఈ శక్తి పనేమిటి?" అని ప్రశ్నించింది నల్లమ్మాయి.

"ప్రపంచాన్ని నడిపించటం."

"అయితే మానవుడు చేసే పనేమిటి?"

వేదాంతులు ఒకరి మొకాలు ఒకరు చూచుకున్నారు.

"మానవుడు ప్రయత్నంచేస్తే ఈశక్తిని లోబరచుకోవచ్చు," అన్నారు వేదాంతులు.

"ఎందుకు?" అడిగింది నల్లమ్మాయి.

వేదాంతులు జవాబు చెప్పలేకపోయారు.

"అయ్యోరామా ! ఇదేం దేవుడు ? మానవులకు లొంగే

దేవుడు," అని తుర్రున పరిగెత్తింది నల్లమ్మాయి.

ఇంతకూ యీ గొడవవల్ల తేలిందేమిటి? దేవునికోసం వెదకటం నిష్ప్రయోజనం. గొప్పవారి మెదడులోనూ, గ్రంథకర్తల పుస్తకాల్లోనూ మాత్రమే వారి దర్శన మవుతుంది. ఈ ప్రదేశాల్లోనే వారు ప్రత్యక్ష మవుతుంటారు. చివరకు బోధిచెట్టుకింద నించొని, ఈ సంగతి గ్రహించి, ఒక్కనిట్టూర్పు విడిచి యీ విధంగా నిర్ణయించుకుంది నల్లమ్మాయి:—

"దేవునికోసమై ఇంత ఆర్భాటమెందుకు? ఇంతవృథా కాలయాపన ఎందుకు? నేను కావలసి వచ్చినరోజు అతగాడే నన్ను వెతుక్కుంటూ వస్తాడు."

## సానుభూతి

ఒకకవి తనస్నేహితుడైన ధనవంతుని దగ్గరకు వెళ్లిఇలాఅడిగాడు—"ఒక్క అయిదు రూపాయిలుంటే బదులివ్వండి. ఇంట్లో బియ్యంలేవు. గోలగావుంది." అడగలేక అడగలేకతడబడుతూ అడిగాడు.

"నా దగ్గర దమ్మిడీలేదు. డబ్బెక్కడ నుంచి వొస్తుంది? నాదొడ్లో పండుతూవుందా? అదీకాక నేనిన్నిసార్లివ్వలేను" అన్నాడు ధనవంతుడు.

"నా కెప్పు డిచ్చారు?"

"నువ్వు మరణించిం తర్వాత శిలావిగ్రహానికి ఇవ్వొద్దూ? ఇప్పుడూ ఇచ్చి, అప్పుడూ ఇచ్చి, నాకిదేపనా?" అన్నాడు ధనవంతుడు.

కవికి ఆరోజు రాత్రి కలలో బొమ్మలు కనిపించినై. తన భార్యాపిల్లలు తిండిలేక ఒకపక్కన ఏడుస్తూవుంటే, ఒకపక్కన తన శిలావిగ్రహం తయారవుతూవుంటుంది. ఆ శిలావిగ్రహానికి డబ్బిచ్చిన ధనవంతుని దాతృత్వాన్నీ రసహృదయాన్నీ ప్రజలు వేనోళ్ళ కొనియాడుతూ వుంటారు.

# జీవిత పరమావధి

ప్రజలకు ఆవేశం ఉద్రేకం ఎక్కువ. ఆవేశం ఉద్రేకం మృగ దశ నుంచీ వున్న గుణాలవటం వల్లా, జ్ఞానం తరువాత వొచ్చిందవటంవల్లా, ఇప్పటికీ మానవులు తమసమస్యల్ని ఆవేశంతోనే దిద్దుకోటానికి ప్రయత్నిస్తున్నారు. అందుకనే ప్రజలు ఆవేశ పూరితంగా మాట్లాడేవాళ్ళనీ, ఉద్రేకపరిచే వాళ్ళనీ చూస్తే సంతోషిస్తారు; అనుసరిస్తారు; నాయక శ్రేష్ఠులుగా పూజిస్తారు.

కాని ఉత్త ఆవేశంవల్ల పనులు జరగవు ఆవేసాన్ని సక్రమ మార్గాల్లో నడిపి, లాభం చేకూర్చటానికి తగ్గ జ్ఞానంకూడా ముఖ్యంగా కావాలి. అయితే మాత్రం ఏం లాభం? గుడ్డి ఆవేశం ఎక్కువమందిని ఆలోచించనివ్వదు. ప్రజలను తనకు బానిసలనుగా చేసుకుంటుంది. జ్ఞానాన్ని దగ్గరకు చేరనివ్వదు. అందువల్ల ఎంతో నష్టం, నాశనం జరుగుతై.

మన జీవితాల్లో ఎక్కువగా కనిపించే దుర్గుణం ఇది! మానవుల అభివృద్ధిని ఎక్కువగా అటంకపరిచేదే ఇది! దీనివల్లే మన జీవితాలు గంద్రగోళం అయోమయం అయిపోతున్నై.

ఒకప్పుడు జీవితాన్ని గురించి ఆలోచించు కుంటూవుంటే అంతా విచిత్రంగాకనిపిస్తుంది. మనంపుట్టాం; బ్రతుకుతున్నాం. ఏక్షణాన్నో ఒకక్షణాన మరణిస్తాం. మనకు ముందుకూడా ఇదే విధంగా కోటానకోట్లు పుట్టారు; బ్రతికారు; మరణించారు. ఈ విషయం మనం రోజూ చూస్తూనేవుంటాం—గమనిస్తూనే వుంటాం. కాని 'మనం ఎందుకు పుడుతున్నట్టు? ఎందుకు బ్రతుకు

తున్నట్టు? ఎందుకు మరణిస్తున్నట్టు?' అని ఎంతమందిమి ప్రశ్నించుకుంటున్నాం?

చాలా కొద్దిమందిమి.

మనం ఎందుకు పుట్టామో, ఎందుకు మరణిస్తున్నామో తెలుసుకోకపోతే, ఎలా బ్రతకాలో, మన జీవితాన్ని ఏవిధంగా నడపాలో బొత్తిగా అర్థంకాదుగదా! అలాంటప్పుడు తెలుసుకోటానికి ఎందుకు ప్రయత్నించం?

దీనికి అనేక కారణాలున్నాయి. అజ్ఞానం, బద్ధకం భయం మొదలైనవి. విడివిడిగా వీటిని విచారిద్దాం. ఒక్కొక్క కారణానికి ఒక్కొక్క రకం ప్రజలు అనుచరులుగా వుంటున్నారు గనుక, ఒక్కొక్క రకాన్ని తీసుకొని, వారి భావాలకు కారణాలేమిటో, వాటివల్ల సంఘానికి లాభమో నష్టమో విచారిద్దాం.

చాలామందికి అజ్ఞానంవల్ల ఈ ప్రశ్నలు తట్టవు. ఏదో పుడుతున్నారు; పుడుతున్నారు గనుక బ్రతుకుతున్నారు; బ్రతుకుతున్నారు గనుక మరణిస్తున్నారు. అంతే! ఏ గొడవా లేకుండా వొచ్చినవాళ్ళు వొచ్చినట్లు దాటిపోతున్నారు.

ఈ అజ్ఞానమే భయానికి దారి తీస్తుంది. ప్రకృతి చర్యల్ని అర్థంచేసుకోలేక పోతారు. అర్థం చేసుకోటానికి ప్రయత్నించే జ్ఞానం లేకపోవటం వల్ల భయపడతారు. సూర్యుడు రోజూ ఎందుకు తూర్పున ఉదయిస్తున్నాడు? ప్రపంచాన్నంతా వెలిగించే కాంతి అతని కెక్కడనుంచి వొచ్చింది? ఆ కాంతిపోతే మానవసంతతి ఏమవ్వాలట్టు? ఈ ప్రశ్నల జవాబులు వాళ్ళకు దొరకవు. వెంటనే వాళ్ళ దృష్టిలో సూర్యుడు భగవానుడయ్యాడు. 'ఓసూర్యభగవానుడా, నీ కాంతిని పోగొట్టుకోక!"

అని ప్రార్థనలు సాగినై. చంద్రుడూ ఇంతే! చెట్లూ పుట్టలూ ఇంతే! ఈ లెక్కనే విషజంతువు లన్నీ, భయంకర జంతువులన్నీ దేవుళ్ళయి కూర్చున్నై. అజ్ఞానంవల్ల, ప్రశ్నించుకోవటం చేత కాకా, జవాబులు దొరక్కా ఈరకం ఈ విధంగా సంఘాన్ని కొన్నాళ్ళు తప్పుదారి నడిపించింది.

ఈరకం ఇలా వుండగా రెండో రకం మరొకటి వుంది. ఈ రకానికి ప్రశ్నించుకోవటం చాతవునుగాని, జవాబులు ఆలో చించుకోవడం భయం, వీళ్ళకి ఈ ప్రశ్న లన్నీ తడతై. వీటికి జవాబుల కోసంకూడా ఆలోచిస్తారు—ప్రయత్నిస్తారు. కాని ప్రయత్నించినకొద్దీ చిక్కుల్లో పడతారు. దారీ డొంకా కన పడదు. తమ కున్న భయంతో, జవాబులు ఆలోచించుకో లేక, చిక్కులు విడదీసుకో లేక, వేదాంతమార్గంలో పడతారు. మట్టి లో పుట్టాం; మట్టిలోకే పోతాం, అని సమాధాన పరుచుకుం టారు. ఈ సమస్యలు పరిష్కరించుకోలేక, ఎదురుతిరిగే ధైర్యం లేక ఈ సమస్యలనుంచీ, లౌక్యరంగంనుంచీ పారిపోతారు. "ఈ ప్రపంచం మిథ్య, మనం మిథ్య, అంతా మిథ్యే!" అంటారు.

అయితే ఈ బ్రతకట మెందుకు ?

ఈ ప్రశ్నలకు సమాధానంగా దేవుడు అవసర మవుతాడు. 'మనల్ని ఈ మాయలోకంలో దేవుడు పడవేశాడు. ఆ దేవుణ్ణి జేరి తరించటానికి ఈ జన్మలో మనం సాధనం చెయ్యాలి,' అం టారు. దీంతో లౌకిక వ్యవహారాలలో జోక్యం లేకుండా చేసు కోవటం; లౌకికచింతే నీచ మనుకోవటం, పరమార్థంకోసం ముక్కు మూసుకోవడం జరుగుతుంది. అంటే మనం ఈలోకం లో చేసేది ఏమీ లేదు గనక బ్రతుకునే చావుగా మార్చు

కుండా మనస్థితికి వొస్తుంది ప్రపంచం. పొట్టకు సంపాదించు కోవటం, కడుపునిండా తినటం మొదలయిన అవసరాలేతప్పయి పోయి, కోర్కెలను అరికట్టటం, ఇంద్రియాలను జయించటం, దేవుని పిలుపు కోసం ఊర్ధ్వదృష్టిని అలవరచుకోనటం ఆదర్శా లవుతవి.)

ఈ పరిస్థితుల్లో మానవులకు మరో ప్రశ్న తట్టింది. దేవుడనే వొకడుంటే ఈలోకంలో ఇన్నిఘోరాలెందుకుజరుగుతున్నాయి? ఈ హెచ్చు తగ్గులకు కారణం ఏమిటి? సన్మార్గులు బాధపట్టం, దుర్మార్గులు సుఖపట్టం ఎందుకు జరుగుతూవుంది ?

ఈ ప్రశ్నలకు జవాబుగా కర్మసిద్ధాంతం, స్వర్గనరకాలూ సృష్టించబడ్డవి. "అదంతా మన ఖర్మ! గీత తప్పుతుందా!"అనే జవాబు. విమర్శించుకోని జవాబు చెప్పలేని ప్రతి ప్రశ్నకూ ఈ వేదాంతులు అడ్డం పెడతారు.

మరొకప్పుడు, "ఈ లోకంలో దుర్మార్గులు తప్పించుకు పోయినా నరకంలో శాస్తి అనుభవిస్తారు. సన్మార్గులకు తగిన పూజలు ఇక్కడ జరక్కపోయినా స్వర్గంలో సుఖం అనుభ విస్తారు" అని చెపుతారు. మన వేదాంతం అంతా ఈవిధంగా వృద్ధిచెందిందే! ఎంతసేపూ, "బాహ్య ప్రపంచంలో ఏమీ సం బంధం పెట్టుకోకు, లోపలకు చూచుకో," అని చెపుతుంది. దీన్నే ప్రజలకు గొప్పగాకనపట్టానిగ్గాను"ఆత్మజ్ఞానం"అంటుంది.

అజ్ఞానంవల్ల అభివృద్ధిని ఆటంకపరిచిందానికంటే ఈసిద్ధాంతం చాలా ప్రమాదకరమైంది. ఈ వేదాంతి తన జ్ఞానాన్ని ప్రజ లను తప్పుమార్గాలను పట్టించటానికి వినియోగిస్తాడు. మాన వులు కావాలనేవన్నీ తానూ కావాలంటూ "వీటివల్ల ప్రయోజ

నం లేదు." అని చెపుతాడు. "మనం వీటిని సాధించుకోలేం" అని నిరుత్సాహపరుస్తాడు. ఈ మధ్య నాకు నా స్నేహితుడికీ ఈదిగువ సంభాషణ జరిగింది. ఆసంభాషణ సరిగ్గా ఈతత్వాన్నే విశదీకరిస్తుంది గనక ఇక్కడ పొందుపరుస్తున్నాను:—

"ఎందుకొచ్చినవండీ ఈ మాటలు?" అన్నాడు.

"మనం అభివృద్ధిచెందటం మీకు ఇష్టం లేదా?" అని అడిగాను.

"ఇష్టం లేకేం! పరిశ్రమలు కావాలి. శుభ్రమైన భోజనం కావాలి! అజ్ఞానం పోవాలి! ఐకమత్యం రావాలి......"

"ఇంకేం? అందుకు ప్రయత్నిద్దాం!" అన్నాను.

"ఏమీ లాభం లేదు. మనవల్ల ఏమీ జరగదు."

"ఎందుకు జరగదు?"

"ఎలా జరుగుతుంది? మనకంటే పెద్దపెద్దవాళ్ళే ప్రయత్నించారు, వాళ్ళేం నెగ్గారు?" అన్నాడు.

ఇదీ వరస. ఈరకం మనకు అభివృద్ధి అక్కర్లేదనే అభిప్రాయిలకు వచ్చేటట్టుగా, ఈ విధంగా (బహుశా తమకు తెలియకుండానే) ప్రచారం చేస్తూ వుంటారు. అంతేగాని ఒకప్పుడు బ్రహ్మాండ రుద్రుడు చెయ్యలేనిపని కొన్ని పరిస్థితుల్లో స్వల్ప మానవుడు కూడా చెయ్యగలుగుతాడని వీళ్ళకు తెలియదు. మనలాంటివాళ్ళు ఇలా వేదాంతం మాట్లాడ బట్టే పెద్దపెద్ద వాళ్ళుకూడా ఏమి చెయ్యలేక పోయారనీ తెలియదు.

ఈ రకంలోనే మరొక తెగవుంది. ఈ తెగకూడా జీవితాన్ని ఎదుర్కోలేని మానవ హృదయ దౌర్బల్యాన్నే సూచిస్తుంది. ఈ ప్రపంచంలో మనం చెయ్యగలిగిందిగానీ, చెయ్య

వలసిందిగానీ, ఏమీ లేదనే బోధిస్తుంది. ప్రపంచంలోని సమస్యల్ని మనం పరిష్కరించ లేమనే చెపుతుంది. కాని ఈ తెగకు దేవుళ్ళో నమ్మకంలేదు. అందుకని పై తెగ ముక్కు మూసుకొని కూర్చుందామని చెబితే ఈ తెగ 'రేపు మనది కాదు; తిని తాగి తందనాలాడదాం,' అని చెపుతుంది.

ఈ సిద్ధాంతం, ముఖ్యంగా యువకులను బాగా ఆకర్షిస్తుంది. ఇంత కంటే ఇంకేం కావాలి? కాని ఇది ఎలా నెరవేర్చుకోవటం? అని ఆలోచిస్తేమాత్రం దీని బండారం బయట పడుతుంది. అంతా తిని తాగి తందనాలాడితే ఉత్పత్తిచేసే దెవ్వరు? ఎక్కువ ఉత్పత్తి లేకుండా ప్రతివాడూ తిని తాగి తందనాలాట్టం ఎలా జరుగుతుంది ?

ఎవరు తిని తందనాలాడాలి? ఎవరు ఉత్పత్తిచెయ్యాలి? తిని తాగి తందనాలాట్టానికి సరిపోయే అంతగా ఉత్పత్తి చేసే విధానం ఏది?

ఈ సంగతులన్నీ వీళ్ళు ఆలోచించరు. వినగానే హాయిగా ఉండే మాటలని తృప్తిపొందుతారు. ఆవేశమే ప్రధానంగా పెట్టుకున్న జనం, జీవితంలో ఆసాభంగాలు పొందిన జనం ఈ మాటలకు నోరూర్చుకొని వెంట పడుతుంది. ఈ తెగ, డబ్బున్నలు గురిసంగతేగాని ప్రజలసంగతి ఆలోచించదు. వీరి వాదంలో సంఘీభావానికే చోటులేదు. వీరి వాదం, మొత్తంమీద సంఘం ఎలా బాగుపడుతుందో చెప్పదు. డబ్బు పుష్కలంగా ఉన్న వ్యక్తులు ఏ విధంగా తమ్ము తాము నాశనం చేసుకొని, సంఘానికి ఏ విధంగా అపకారం చెయ్యాలో మాత్రమే ఈ సిద్ధాంతం నేర్పుతుంది.

పాసుపాలనల్లా, జమీందార్లవల్లా ఇంతకంటె ఎక్కువేమి జరిగింది? తిని కడుపు బలవంతంగా ఖాళీచేసుకొని, మళ్ళీ తిన్న వాళ్ళని గురించి మనంవిన్నాం. వీళ్ళవల్ల సంఘానికి ఏమిలాభం చేకూడుతుంది?

వీటన్నిటికంటే మేరీకారిల్లీ పాత్రలాగు, 'భగవంతునుడంటే అతన్నిత్వరగా పొందాలి; లేకపోతే అసలు జీవితమే అనవసరం,' అనుకొని ఆత్మహత్య చేసుకోవటం మంచిది కాదూ?

ఇక ప్రజల్లో వున్న ఆఖరి రకాన్ని గురించి చెప్తాను.

ఈ రకం మానవసంఘంలో, సంఖ్యలో తక్కువదీ, ఆదర్శంలో గొప్పదీ! ఈ రకం కార్యాచరణకు అందని వూహలను వూహించదు. అందని వూహలు వూహించి, భంగపడి అసంతృప్తివల్ల వేదాంతమార్గంలో పడదు. 'మనవల్ల ఏమవుతుంది?' అని నిస్పృహ చెందదు. పరిస్థితులకు అనుకూలంగా సంఘాభివృద్ధికి పాటుపడుతుంది.

ఈరకానికి సంఘాభివృద్ధికిపాటుపడాలనేవాంఛా ఆవాంఛను ఆచరణలోపెట్టే శాస్త్రజ్ఞానం రెండూ వుంటాయి. ముఖ్యంగా వాంఛ వుంటే శాస్త్రజ్ఞానం కోసం ప్రయత్నిస్తాం. ఈరెండూ లేకపోతే లాభం లేదు.

Bentham ఇలా వ్రాశాడు— 'A person who always acted with a view to his own maximum satisfaction in the long run would always act rightly."కుటుంబరావు కూడా స్వార్థం అనే కథలో ఇల్లాంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చాడు. కాని నేను వొప్పుకోను. నిరంకుశంగా రాజ్యాలు ఏలినవాళ్ళంతా ప్రపంచానికి లాభాన్నే చేకూర్చారా?

తల్లికి బిడ్డ జబ్బు నయం అవ్వాలనే వాంఛ వుంటుంది. కాని తగిన శాస్త్రజ్ఞానం లేకపోవటంవల్ల మందుకు బదులు ముడు పులుకట్టి ప్రాణంమీదకు తెస్తుంది. సంఘాన్ని బాగు చెయ్యా లనే వాంఛ లేకుండా శాస్త్రజ్ఞానం వున్నా ఇంతే జరుగుతుంది. ఆ శాస్త్రజ్ఞానం మానవనాశనానికి వినియోగ పడుతుంది. దీనికి హిట్లరే తార్కాణం.

పై తరగతికి ఈ రెండు లక్షణాలూ ఉన్నాయి గనక వెనక చూపు లేకుండా మానవ శ్రేయస్సుకి పాటుపడుతుంది. అంత మాత్రాన ఈవర్గానికి స్వార్థంలేదు అనుకో గూడదు. తమ సుఖం సంఘాభివృద్ధిమీదే ఆధారపడి వుంటుందనీ సంఘానికి భిన్నంగా ఒక వ్యక్తి సుఖపడ లేడనీ తెలుసుకొని పాటుపడ తారు; ఏలాగూ మనం బ్రతకట మనేది తప్పదు గనకా, మన తర్వాత కూడా మానవులు బ్రతుకుతూనే వుండాలి గనకా, ఈ ప్రపంచాన్ని మానవవాసయోగ్యం చెయ్యటానికి ప్రయత్ని స్తారు. మానవులు ఎక్కువ మంది సుఖపటానికి వసతులు కల్పిస్తారు.

నేను ఈమాట చెప్పినప్పుడు 'సుఖపట్టం అంటే ఏమిటి?' అనే ప్రశ్న వొస్తుంది, అనేకమంది అనేక రకాలుగా సుఖపడ తారు. ఒకరికి సుఖమిచ్చింది మరొకరి కివ్వదు. ఒకరికి సుఖా న్నిచ్చిన సిద్ధాంతమే మరొకరిని బాధపెడుతుంది. కనుక సుఖం అంటే ఎలా తెలుతుంది? దేన్ని సుఖంగా పెట్టుకొని మానవులు కృషి చెయ్యాలి?

ప్రపంచంలో అనేక సమస్యలున్నమాట నిజమే. ఒక్కొక్క సమస్యా పరిష్కారం ఒక్కొక్క తరగతికి సుఖాన్నిచ్చేమాటా

నిజమే! కాని అన్ని సమస్యల్ని ఒకేసారి మనం పరిష్కరించ లేం. అప్పటి పరిస్థితుల్లో ప్రజాసామాన్యాన్ని ఎక్కువ కలవర పరిచే సమస్యనే పరిష్కరించటానికి ప్రయత్నించాలి, అటువంటి సమస్యనే పరిష్కరించగలం. మరొక సమస్యకు ప్రజలు సహా యం చెయ్యరు; పరిష్కారానికి తెగించి పోట్లాడరు. ఏ సమస్య తమ్ము ఎక్కువగా హింసిస్తూవుందో, ఆ సమస్యను పరి ష్కరించుకోటానికే ప్రజలు తాపత్రయపడతారు. ప్రస్తుతం ప్రజలను ఎక్కువగా కలవరపెట్టే సమస్య ఆర్థిక సమస్య. ఈ సమస్యా పరిష్కారం కోసం ప్రజలు ఉద్రిక్తులై వుంటారు. తమ్ము బాధించే ఈ సమస్యని పరిష్కరించకుండా మరేసంగతి ఎత్తినా ప్రజలు వినరు. అందుకనే మిగిలిన ఉద్యమాలు సఫలిత పొంద టంలేదు. ప్రజల్దాకా వెళ్ళటంలేదు—పైపై నేపుట్టి, పైపై నేనశి స్తున్నాయి. ఇలా జరుగుతూవుందని వాపోవటంలో అర్థంలేదు. సంఘశ్రేయస్సుకోసం పరిస్థితులనుబట్టి పాటు బడాలిగాని, అవ సరంగా కనబడని భావాలను వాళ్ళ తలలకు ఎక్కించట'నికి ప్రయత్నిస్తే వృథాయే అవుతుంది.

కనక మానవుడు తను జీవించివున్నంతకాలం అత్యవసర సమస్యని పరిష్కరించటానికై ప్రయత్నించాలి. ఈ సమస్య పరి ష్కరించబడ్డా మరొక సమస్య వొస్తుందని వూరుకోకూడదు. పద్ధతి ఏది అనుసరించినా, జీవితాదర్శం ప్రతి మానవుడికీ, "ఈ లోకాన్ని వాసయోగ్యం చెయ్యటమే!" అనే విషయం ఎవ్వరూ మరచిపోకూడదు.

## రెటమత సిద్ధాంతం

రెటమతం అనే మాట మనం రోజూ వింటూనే ఉంటాం. మనం ఒక నూతనోద్దేశం వెలిబుచ్చగానే, అది ప్రజాసామాన్యానికి వికటంగా కనిపిస్తుంది. వెంటనే మన ప్రక్కనున్న ఒకడు 'రెటమతం' అంటాడు. రెండోవాడు లౌక్యమర్యాదలతో, తెలివిగలవాడేగాని అంతా 'రెటమతం' అంటాడు. ఏమిటీ రెటమతం? దీని స్వభావం ఎటువంటిది?

'అవునన్నది కాదనటం రెటమతం' అని తేలిగ్గా నిర్వచనం చేస్తారు. ఎవ్వరు అవునన్నది? ప్రజాబాహుళ్యం అవునన్నది కాదనటం రెటమతంగా కొందరు అర్థంచేసుకుంటున్నారు. ఈ రెటమత సిద్ధాంతం ప్రాముఖ్యతను అర్థంచేసుకోటానికి మనం ఒక ప్రశ్న వేసుకోవలసివస్తుంది; "ఒక ఉద్యమనాయకులు ప్రజాబాహుళ్యాన్నిబట్టే పోవాలా, లేక ప్రజాబాహుళ్యాన్ని తమ దృక్పథానికి తిప్పుకోటానికి ప్రయత్నించాలా?" అనేది. నాయకులు ప్రజాబాహుళ్యం అభిప్రాయాలకు అనుగుణంగా గంతులు వేసి పేరు సంపాదించుకోటాన్ని లెనిన్ "tailism" అని హేళన చేశాడు. అచ్చగా ప్రజాసామాన్యం పలవరింతలకే తందనాలు తొక్కితే, సంఘంలో అభివృద్ధి అనేదే ఉండదు. ఇటువంటి నాయకత్వం "కాననివాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్ కాననిభంగి"గా తయారవుతుంది. కనుక మానవుడు వేసినచోటే ఉంటాడు. లేకపోతే సుడిగుండంలో పడి కొట్టుకుంటాడు.

ఎప్పుడైతే మనం ప్రజాబాహుళ్యం దృక్పథాన్ని మార్చటా

నికి ప్రయత్నిస్తామో, అప్పుడే ప్రజాబాహుళ్యం తాత్కాలికంగా ఎదురుతిరగటం, రెటమతం అని నిందించటం తటస్థిస్తుంది. 'దేవుడున్నాడు,' అని ప్రజాబాహుళ్యం నమ్మినప్పుడు 'దేవుడు లేడు' అని చెప్పటం రెటమతంగా పరిగణింపబడుతుంది. 'రాముడు దేవుడు,' అనుకునే రోజుల్లో 'రాముడు మానవుడు,' అని చెప్పటం రెటమతంగా పరిగణింపబడుతుంది. 'భూకంపాలు ఆ మాయామానుష విగ్రహుని లీలావినోదాలు,' అనుకునే రోజుల్లో వాటికి సైంటిఫిక్ కారణాలున్నాయని చెప్పటం రెటమతంగా పరిగణింపబడుతుంది.

"మీరు చెప్పేది సహేతుకంగాఉంటే అది రెటమతం కాదు;" అని కొందరు వాదిస్తారు. బాగానేఉంది. కాని ఒక నూతనోద్దేశం సహేతుకమో—నిర్హేతుకమో, తెలుసుకోటానికి ప్రజాసామాన్యం కొంత టైము తీసుకుంటుంది. ఈ విషయంలో ప్రజాసామాన్యం జ్ఞానాన్ని అనుభవంవల్ల సంపాదించుకుంటుంది గాని బుద్ధిబలంవల్లకాదు. అందువల్ల ఒక నూతనోద్దేశాన్ని వెలిబుచ్చగానే ప్రజాసామాన్యం, తరువాత ఆ ఉద్దేశాన్ని అంగీకరించినా, వెంటనేమాత్రం 'రెటమతం' అంటుంది. సహేతుకమైన విషయాన్ని వెంటనే గ్రహించే శక్తి ప్రజాసామాన్యానికి లేకపోబట్టే, తన విశ్వాసాలను వదలుకొని వెంటనే హేతువాదాన్ని అంగీకరించలేదు, కాబట్టే, అది గెలిలియో ప్రాణాలను కోరింది. ఏసుక్రీస్తును సిలువ ఎక్కించింది. ఆస్కార్ వైల్డును దేశంలోనుంచి తరిమివేసింది. మహమ్మదుచేత కత్తిని పట్టించింది. ఇంకెన్నెన్నో చేసింది.

కనుక ప్రజాసామాన్యాన్ని నేను ఆకర్షించాను అని ప్రగ

ల్యాలు కొట్టటం గొప్పకాదు. అతడే పద్ధతితో ప్రజాసామా న్యాన్ని ఆకర్షించాడో మనం తెలుసుకోవాలి. జాన్సన్ చెప్పి నట్టు ప్రజాసామాన్యం నాన్ సెన్సూ, అతని నాన్ సెన్సూ ఒకటే అవటంవల్ల అది అతనివల్ల ఆకర్షించబడిందా? నీతిబాహ్యమైన మాటలు వాడటంవల్లో, అటువంటి ఉద్దేశాన్ని స్ఫురణకు తేవ టంవల్లో, దానిపై త్యాన్ని రేపటంవల్లో, అది ఆకర్షించబడిందా? అని మనం ఆలోచించాలి. ఆ పద్ధతి మంచిదై దానివల్ల సంఘా నికి లాభం కలిగితే సెబాస్ అని మనం హారతులు పట్టాలి. లేకపోతే ఆ ఆకర్షించినవాడూ, ఆ ఆకర్షించబడినవారూ నర కానికి పోతారు.

ప్రజాబాహుళ్యం అనేకవిధాలగా ఆకర్షించబడుతుంది. వ్యభి చారాన్ని గురించి రాస్తే అనేకులు ఆకర్షించబడుతారు. ఎవ్వరో్ని పట్టుకొని బండభూతులు తిడితే కొందరు సంతోషి స్తారు. చిత్రకార్తికుక్కల చేష్టలు వర్ణిస్తే 'వహ్వా' అంటారు. నగ్నదృశ్యాలు చూపితే లొట్టలు వేసుకుంటూ చూస్తారు. అంతమాత్రాన ఈ విధంగా రంజింపజెయ్యటం గొప్ప అవు తుందా? దీనికంటే ప్రజాబాహుళ్యానికి ఇష్టంలేకపోయినా, దానివల్ల చెప్పేవాడు నష్టకష్టాలకు లోనయినా, సంఘ శ్రేయ స్సుకు ప్రయత్నించటమే మంచిది. దాన్ని ప్రజాబాహుళ్యం 'రేటుమతం' అని నిందించి, అతడిని హింసించినా, కొన్నాళ్ళ కయినా యదార్ధం తెలుసుకొని బాగుపడుతుంది,

ఇప్పుడు నేనున్నాననుకోండి—ప్రవక్తలతో పోల్చుకోవటం కాదు—నాకు ప్రజాసామాన్యంలో ఇప్పుడు ప్రబలంగావున్న రుచి ఇష్టంగా ఉండదు. ప్రజాసామాన్యం ఒకరుచికి అలవాటుపడటం

వల్ల, రాజకీయంలో చూచినా సారస్వతంలో చూచినా, సినిమాల్లో చూచినా ఆ రుచే కనబడుతుంది. ఆ రుచి మంచిదిగా నాకు కనపడకపోవటంవల్ల రాజకీయంలో, సారస్వతంలో, సినిమాలలో, ప్రజల అభిరుచికి వ్యతిరేకంగా ఆ రుచిని విమర్శించవలసి వస్తుంది. ఈవిధంగా ప్రతి శాఖలోనూ ప్రజాసామాన్యంతో ఏకీభవించక పోవటంవల్ల అందరూ అవునన్నది కాదనే మేనియా నాకున్నదనీ, నేను అదొక సిద్ధాంతముగా పెట్టుకొని కూచున్నాననీ నన్ను నిందించటం కేవలం పొరపాటు. ఇప్పుడు ప్రజలలో ఉన్న రుచిని నేను అంగీకరించటం లేదు. ఆ రుచి ఏ శాఖలో కనుపించినా నేను విమర్శిస్తున్నాను. ఆ రుచిని ఒక శాఖలో నిందించి, ఒక శాఖలో పొగడటం తప్పుగాని, ఆరుచి కనబడిన చోటల్లా విమర్శించటం తప్పు కాదు.

కనుక రెటమత సిద్ధాంతంఅనగానే బెదరిపోవలసిన పని లేదు. ఇప్పుడు నాకు అర్థంకాని నూతనోద్దేశాన్ని నేను రెటమతం అంటున్నాను. మీకు అర్థంకాని నూతనోద్దేశం మీకు రెటమతంగా కనిపిస్తోంది. హాలీవుడ్ ఫిలుములు చూచి హిందీ ఫిలుములను విమర్శించేవాడు, తెలుగుఫిలుములతో హిందీ ఫిలుములను పోల్చి చూచుకొని మురుసుకునేవాడికి రెటమతస్థుడుగా కనపడతాడు. తెలుగుఫిలుములతో పోల్చుకొని హిందీ ఫిలుములను పొగిడేవాడు, హాలీవుడ్ ఫిలుములు చూచినవాడికి రెటమతస్థుడుగా కనబడతాడు.

ఈ రెటమతసిద్ధాంతం జాగ్రత్తగా పరిశీలించవలసిన సిద్ధాంతం. ఇది తెలియనివాళ్ళు ప్రచారంచేస్తున్నంత, పైకి కనబడేంత పిచ్చిసిద్ధాంతం కాదు. దీని భావం తెలుసుకోవటం మీ దే.

దీని హృదయాన్ని అర్థంచేసుకోవటం మీదే, సంఘాభివృద్ధి ఆధారపడి ఉంది.

## అహం

ఒక కవి, ఒకసభలో ఈవిధంగా ఉపన్యసిస్తున్నాడు—

"మీరు కనిపెట్టారో లేదోగాని నేను తిక్కనకంటె గొప్పవాణ్ణి. నాకవిత్వంలో తిక్కన కవిత్వంలోవున్న గుణాల కంటే గొప్పగుణాలున్నవి. ఇంతవరకు భారతదేశంలో పుట్టిన వాళ్ళల్లో తిక్కనకంటే గొప్పకవిని నేనే......"

ఒక సభికుడు చివాలున లేచి—"తిక్కన కంటే మీరు గొప్ప కవులనుకోటానికి దృష్టాంతరం ఏమిటీ?"

"దృష్టాంతరమా?...దృష్టాంతరమా," అని నట్లు కొట్టటం మొదలు పెట్టాడుకవి.

ఇంకొక సభికుడు లేచి ఈవిధంగా జవాబు చెప్పాడు— "దృష్టాంతరాలకేం? కావలసినన్ని వున్నాయ్. తిక్కనా కవిత్వంరాశాడు. వీరూ కవిత్వంరాశారు. తిక్కనా పుట్టాడు. వీరూ పుట్టారు. వీటిని బట్టి తిక్కనకూ వీరికీ చాలా పోలిక లున్నవని విశదం అవుతూవుంది. ఇక తిక్కనకంటే ఈయన గొప్పవా డెలాగంటూరా? తిక్కన చచ్చాడు. ఈయన చావ లేదు......" అని కూర్చున్నాడు.

కవి తెల్లమొహం వేశాడు.

# నాగరికత

"తూర్పు తూర్పే — పడమర పడమరే ! ఈ రెండూ ఎప్పుడూ కలవ్వు" అన్నాడు కిప్లింగ్.

సామ్రాజ్యతత్వం కన్నులకు ఎగదట్టిన కిప్లింగ్ ఈవిధంగా వాగటంలో ఆశ్చర్యం లేదు. "తెల్లతోలు ప్రపంచానికి మోక్షాన్ని కట్టిపెడుతుంది." అనుకునే బధిరులు ఇలాంటి వెర్రి వ్రాతలు వ్రాయటంలో ఆశ్చర్యంలేదు. "తెల్లవారు ప్రభుత్వం చెయ్యటానికీ, నల్లవారు జోహుకుం కొట్టటానికీ పుట్టా"రని ఈ బుద్ధిజాడ్యజనితోన్మాదుల ఉద్దేశం.

ఈ వాదం ఎంతవరకు నిజం ?

ప్రాచ్య ప్రాశ్చాత్య నాగరికతల్లో విపరీతమైన భేదముందనీ, ఈ భేదం ఎప్పుడూ ఇల్లాగే వుంటుందనీ కొందరు సామ్రాజ్యవాదులు అంటారు. దీన్నే భారతీయుల్లో కొందరు, "పాశ్చాత్యులది జడవాదం; మనది ఆధ్యాత్మికవాదం," అని చెబుతారు. పాశ్చాత్యులు తమ భౌతికనాగరికతను చూచుకొని విర్రవీగితే, భారతీయులు తమఆధ్యాత్మిక నాగరికతను తలచుకొని మురుసుకుంటారు. అసలు ఈ నాగరికతల్లో ఇంత వ్యత్యాసం ఉందా ? ఈ నాగరికతలు ఏకం కావా?

ప్రథమంలో ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లో ఒకటే నాగరికత ఉండేది. జిజ్ఞాస మానవుని స్వభావంలో ఉండటంవల్ల అతను హేతువాదాన్ని సాధనంగా తీసుకొని జీవితాన్ని గడిపాడు. ఉపనిషత్తులను పరిశీలిస్తే మానవుని స్వభావం తేలిగ్గా అర్థమవుతుంది. మానవునికి కలిగిన ప్రశ్నలకు సమాధానాలు

చెప్పటానికి అవి ప్రయత్నించినయ్. "దేవుని స్వభావం ఎటువంటిది?" "దేవుని దర్శనం ఏవిధంగా దొరుకుతుంది?" అనే మానవుని జిజ్ఞాస వీటిని సృష్టించింది.

కాని అప్పుడు జ్ఞానం వృద్ధిచెందకపోవటంవల్లా, అప్పటికి మానవుడు ప్రకృతిని లోబరచుకునే శక్తులను సంపాదించుకొనలేక పోవటంవల్లా, మానవునికి కలిగే ఈశంకలను, జ్ఞానం తీర్చలేకపోయింది. ఇక మానవుడు చేసేదిలేక విశ్వాసాన్ని ఆశ్రయించాడు. ఈ "విశ్వాసం" ఆధ్యాత్మిక నాగరికతకు దారి తీసింది.

తరువాత కొద్దికాలానికి సైన్సు వృద్ధిచెందటంవల్ల పాశ్చాత్య దేశాలు ఈ నాగరికతనుంచి తప్పించుకొని అభివృద్ధి చెందాయి. మన దేశంవంటి దేశాలు మాత్రం,కొన్ని కారణాలవల్ల సైన్సు సహాయంతీసుకోక, వెనుకటినాగరికతలోనే కుమిలిపోతున్నాయి. కనుక భౌతిక ఆధ్యాత్మిక నాగరికతల భేదం ఇంచు మించు 500 సంవత్సరాల క్రింద కలిగింది.

ఇప్పుడు మనం స్వాతంత్ర్య సమరానికి నడుముకట్టాం గనక మనంకూడా భౌతిక నాగరికత కోసం, పాశ్చాత్యులు ఆ నాగరికతవల్ల పొందిన లాభాలకోసం, ప్రయత్నిస్తున్నాం. మనంకూడా మనుష్యులమే గనక, భౌతిక ప్రపంచంతో. భౌతిక వాదంతో సంబంధం వదలుకోలేం. "జడవాదం," "పిడివాదం" అనుకొని ఏ పదిరోజులో ముక్కుమూసుకొని కూర్చున్నా, తరువాత అయినా ఊపిరాడక ఇతర దేశాలతో పాటు వృద్ధిచెందటానికి ప్రయత్నిస్తాం.

కనుక కిప్లింగ్ మహాశయుడు, "తూర్పు తూర్పే—పడ

పర పక్షమ రే," అనటం ఆయన అజ్ఞానాన్నో, సామ్రాజ్యతత్వ పిరాయింపునో, బుద్ధిజాడ్యాన్నో సూచిస్తుంది? "మాది ఆధ్యాత్మిక నాగరికత," అని మన నాగరికతను పొగుడుకోవటం "పాశ్చాత్యులది భౌతికనాగరికత," అని వారిని నిందించటం కూడా అనారోగ్యాన్నే సూచిస్తుంది, పూర్వం మనం ఏ పరిస్థితుల్లో, ఏ నాగరికతలో, ఎంత జ్ఞానంలో ఉన్నా, ఇప్పుడు మాత్రం పాశ్చాత్యులకంటే ఏ 500 సంవత్సరాలో వెనకబడి ఉన్నాం. అందుకనే, అభివృద్ధిలో వారితో కలుసుకోటానికే మనం స్వాతంత్ర్యం కావాలంటున్నాం; ఆంగ్లేయులు మూటా ముల్లెలతో ఖాళీ చెయ్యాలంటున్నాం; మన డబ్బు మనకే ఉండా లంటున్నాం. భౌతికంగా పాశ్చాత్య నాగరికతను ఈ విధంగా అనుకరిస్తూ, దాన్ని నిందించి, మనం విడిచిపెడుతున్న ఆధ్యాత్మిక నాగరికతను పొగట్టం ఆరోగ్యవంతులు చెయ్యవలసిన పని కాదు.

ఇప్పుడు ప్రాచ్య పాశ్చాత్యనాగరికతల కున్న భేదం ఏమిటి? భౌతిక వాదం అంటే ఉలిక్కి పడవలసిన అవసరం ఏముంది?

సర్ రాధాక్రిష్ణ పాశ్చాత్య నాగరికతకూ మన నాగరికతకూ మూడు భేదాలు చెప్పాడు. నేటి పాశ్చాత్య నాగరికతకు (1) మానవాధికారం (2) హేతువాదం (3) ప్రజాస్వామికం ముఖ్యలక్షణాలు. మన నాగరికతలో ఈ లక్షణాలకు తావు లేదు. నేడు ప్రజాబాహుళ్యానికి ఏ లక్షణాలు ప్రాణాధారాలో, ఏ లక్షణాలు లేకపోతే మానవుడు పశువుగా తయారవుతాడో, అటువంటి లక్షణాలకు మన "ఆధ్యాత్మిక నాగరికత"లో తావు లేదు. అటువంటి నాగరికతను మనం పొగుడు

కుంటున్నాం.

దీనికంటే, ఇతర దేశాలకంటేమనంఎంత వెనకబడిఉన్నామో తెలుసుకొని, దేశాభివృద్ధికి ప్రయత్నించటం మేలు. ఈఅధ్యాత్మిక నాగరికత అనే మత్తులో పడి ఉండటం విదేశ ప్రభుత్వానికి మంచిది గనక, అది దాన్ని ప్రోత్సహిస్తుంది. కనుక విదేశ ప్రభుత్వం పోతేగాని మన అభివృద్ధి విజృంభించదు.

అప్పుడుగాని, "తూర్పు తూర్పే-పడమర పడమరే!" అన్న కిప్లింగ్ వాక్యం ఎగిరిపోదు.

## కులతత్వం - జాతీయవాదం

బానిసవర్గం తన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోటానికి చేసే ప్రయత్నం కులతత్వం.

అధికారంలో వున్నవర్గం మిగిలినవర్గాలమీద తనపెత్తనం సుస్థిరం చేసుకోటానికి చేసే ప్రయత్నం జాతీయవాదం.

కులతత్వానికి, ఆర్థికదృష్టిఏర్పరచి వర్గతత్వంగా చెయ్యటం సోషలిజం.

# ఛీ, ఏమి పరీక్షలు !!

ప్రిజా వొదిలింది. 15 సంవత్సరాల శని నేటితో విరగడయింది. అబ్బా, ఈ పరీక్షల కోసం బుద్ధిని ఎంత సంకుచితం చేసుకోవాలి! మాట్రిక్ ఏమయినా, మన పది మార్కులూ మనం దేవుకుంటే చాలు. సుభాస్ బాబు ఆరోగ్యం ఎల్లావున్నా మన పది మార్కులూ మనం దేవుకుంటే చాలు. కాంగ్రెస్ సభాధ్యక్షుడు వల్లభాయి అయినా, రాజగోపాలాచారి అయినా, గఫూర్ ఖాన్ అయినా ఒక్కటే మనకు! సుభాస్ బాబు ఇంత వరకు కాంగ్రెసు అధ్యక్షుడు ఎందుకు కాలేదో, మిగతా నాయకులు మాత్రం తిరగబడి, బోర్లబడి, ప్రక్కకు పడి, ఒక్కొక్కరూ రెండు మూడు సార్లు ఎందుకు అవుతున్నారో మనం ఆలోచించం. అంతవరదాకా ఎందుకు? ఆ రోజుల్లో ఐశ్వర్యార్థం చదువుకునే అవకాశంగానీ, భార్యకు ఉత్తరం రాసుకునే ప్రాప్తం గానీ ఉండదు. ఏం పరీక్షలు! పక్షినై పుట్టినా ఈ పరీక్షలు తప్పేవి; హాయిగా పళ్లు కొరుకుతూ ఆకాశాన విహరించే పని. ఆఖరికి కోతినై పుట్టినా ఈ పరీక్షలు తప్పేవి. కిచకిచ మంటూ చెట్లమీద గంతులు వేస్తూ తిరిగే పని. ఈ పాడు పరీక్షలు ప్యాసయి ఉద్యోగం చేసిందానికన్నా ఏ పరీక్షలూ లేకుండా, యమధర్మరాజు క్రింద దున్నపోతుపని చెయ్యటం మంచిది.

ఏం పరీక్షలు! ఏం పరీక్షలు! క్లాసుపుస్తకాలు ముక్కున పెట్టుకొని నాటికి ముప్పై మార్కులు గెల్చుకొంటానికేనా నేను

పుట్టింది ! ఏగుమాస్తాగిరిలోనో జేరి. ఉదరం నవరించుకోటాని కేనా నేను పుట్టింది ! హాతవిధీ ! ఈ ఖోడి డిగ్రీలకోసం దేవు లాడకపోతే ఈ పాటికి ఎన్ని ఉత్తమ గ్రంథాలు తిరగవేసే వాణ్ణో ! అబ్బా ! శక్తిని సద్వినియోగం చెయ్యటానికి ఈ పరీ క్షలు ఎంత ఆటంకం ? వీటివల్ల ఎంతమంది జ్ఞానం డిప్పలలోని వేరుసెనగపప్పులాగ, బురఖాలోని స్త్రీలాగ, లోకాన్నుంచి కప్పివేయబడుతోందో ! ఎవరిదాకో ఎందుకు ? అమృతమే లేని ఈ రాహువు నోట్లో చిక్కి నేను నా కాంతిని ఎంత కోల్పో యానో ? ఊహ వచ్చిందగ్గర నుంచీ పరీక్షలకు చదవటం, పరీ క్షలువ్యాసవటం—వ్యాసయిునందుకు ఘనకార్యం చేసినట్లు కుల కటం—తప్ప ఇంకొకపని లేదుగదా ! ఇటువంటి వెంగళాయిలు దేశానికి ఎందుకు పనికివస్తారు ? మాతృదేశోద్ధరణకు పనికి వచ్చే శక్తిని, బుద్ధిబలాన్ని, అవకాశాన్ని లాగివెయ్యటమే ఈ విద్య యొక్క ముఖ్యోద్దేశం. అందుకనే మెకాలే ప్రభువు— (?) — "ఈ విద్యావిధానం ముప్పై సంవత్సరాలు సాగితే హిందూ దేశం తారుమారవుతుం" దన్నాడు.

*

ఎంత ఘోరం ! స్వార్థపరులు ఎంత పనైనా చేస్తారు. మతం పేరుతో, అందులో ఏసుక్రీస్తు పేరుతో, ఏ పని చేసినా ముక్తి దాయకమే అవుతుంది. ఏసుక్రీస్తు మానవ సౌభ్రాతృత్వాన్ని బోధించాడు. అటువంటి మతాన్ని మానవనాశనానికి ఉపయో గించుకుంటోంది అతని భక్తబృందం. ఏ ధర్మమయినా ఇంతే ! అందుకనే మిల్టన్—జ్ఞాపకం రానటంలేదు. ఈ నిరర్థకపు పరీ క్షలకు చదివే చదువు ఇల్లాగే ఉంటుంది—ఏదీ...అవును.

"....... So little knows
Any but God alone to value right
The good before him but perverts best things
To worst abuse or to their meanest use"

అన్నాడు.

అర్థంచేసుకునే వాళ్ల హృదయాలకు అనుకూలమైనరూప త్తాలుస్తుంది. స్వధర్మమయినా......సంఘ శ్రేయస్సు కోస సృష్టించబడిన వర్ణాశ్రమధర్మం నేడు సంఘాన్ని చిందరవందర చెయ్యడానికిఉపయోగపడుతోంది. అదేవిధంగా క్రైస్తవమత అవసానదశలో హిందువులను బానిసలను చెయ్యటానికి పని చేస్తోంది. ఆంగ్లేయులకు మనలను ఆ మతంలోకి తోలటాని —అంతవరదాకా కాకపోయినా, మనమతం మరచిపోవటానికి. ఉపయోగిస్తుం దీ చదువు. మనజనం ఈసంగతి ఆలోచించదు. ఈవిద్య అభ్యసించవలసిందే! ఈ పరీక్షలు ప్యాసు కావల సిందే! ఈజీవితం విద్యాలయాలకు అర్పించవలసిందే! యువక లంతా తలగుడ్డలుధరించి గుమ్మస్తాలుగా తయారయి, మొహాల వేలవేసుకొని, అడ్డమయినవారికీ జోహారులు చెయ్యవలసిందే ఆర్యావర్తం కర్మభూమి...కాబట్టి దేవుడే వీళ్ళని, "మీరు భారతదేశంలో—ఈరకానికి ఇంతకంటే మంచిదేశం దొరకదు- గుమ్మస్తాలుగా పుట్టండర్రా," అని ఆజ్ఞాపించి పంపించాడేమో కాని ఒక్క మనదేశాన్నే నిందించుకోవలసిన పనిలేదు. అసల కాలేజీవిద్యావిధానంలోనే ఉంది ఈ దాస్యగుణం. చూడు!.. జీవితసమస్యలను అచ్చుగా పుస్తకాలద్వారా కాక ముఖాముఖి చూడగలవారే ప్రముఖులవుతున్నారు. మార్కొనాల్డు వార్త పత్రికలను అమ్ముకోకపోతే అంతగొప్పవాడయ్యేవాడు కాడు

ముద్రోజార్జి సార్వభౌముడు నావికులతో కలిసి తిరగకపోతే న తండ్రిలాగే తయారయ్యేవాడు. స్టాలిన్ ఎన్ని పరీక్షలు ప్యాసయ్యాడు? బెర్నార్డ్‌షా నిక్కుతాడు గాని ఏ ఏ కాలే జ్లో చదివాడు? ఎటుచూచినా కాలేజీ చదువు లేనివారే ప్రపంచాన్ని కేలెత్తి నడిపిస్తున్నారు. వీరందరూ గ్రంథాల రాల్లో పీఠం వెయ్యక, డిగ్రీలకోసం కాలేజీల్లో మురిగితే ఎవ్వరి న్నా గొప్పవారయ్యేవారు ?

*

పాపిష్ఠిజన్మ ! కడుపే కైలాసంగా నిర్మించుకోటానికేనా నుజన్మించింది ? నాలుగుకాలాలపాటు—బహుశా పువ్వు కో. కాయలతో—ఈ ప్రపంచంలో బ్రతకటానికేనా నేను న్మించింది ? బుద్ధిబలాన్ని దేశక్షేమానికీ, మానవశ్రేయస్సుకీ వినియోగించవలసిన బాధ్యత లేదా? అవును, ఎట్లా వుంటుంది ? ప్రపంచమంతా పరీక్షల మయమయి పోయింది. డిగ్రీలుసంపా దించ లేనివాడు మూర్ఖుడు; ఏ వుద్యోగానికీ అతడు పనికిరాడు; ఎంతజ్ఞానం సంపాదించినాసరే, ఎన్ని ఉన్నత గ్రంథాలు క్షుణ్ణం చేసినాసరే ! "దాశరథీ కరుణాపయోనిధీ" అనీ, "Jack and jill went up the hill" అనీ రుబ్బుడు మొదలుపెట్టకపోతే ఈ దేశంలో చోటులేదు. ఏమి నాగరికత! ఏమి అభివృద్ధి ! ఈ వెధవ చదువువల్ల గుమాస్తా మయమయిందీ ప్రపంచం. యీ గుమాస్తా బాబులు దేశానికి ఎందుకు పనికివస్తారు ? మన దేశో ద్ధరణకు, ఈవిద్యావిధానాన్ని మార్చటానికి ఎందుకుప్రయత్నిం చరు ? రష్యాలో టాల్‌స్టాయి స్థాపించటానికి ప్రయత్నించిన విధానాన్ని మన దేశంలో ఎందుకు అమల్లో పెట్టరు ? మొన్న

జవహర్‌లాల్ నెహ్రూ ఏమని చెప్పాడు? "ప్రపంచం విషమపరిస్థితుల్లో ఉంది. విశ్వవిద్యాలయాలు యువకులను ఈ సమస్యలు ఎదుర్కోటానికి తయారుచెయ్యాలి," అనలేదా? ఈ మాటలు దేశోద్ధారకులు వినిపించుకో రెందుకని? ఈ గుమ్మస్తాలను అడ్డంపెట్టుకొని స్వరాజ్యం సంపాదించగలమనేనా? ఏమైనా ఈ విద్యాలయాలు దేశానికి చేస్తూన్న అపకారం భాయి పరమానంద్, జిన్నాలుకూడా చెయ్యటంలేదు. ఈ కళాశాలలు —కళాశాలలుకావు, నేతిబీరకాయలు—నేలమట్ట మయినప్పుడే స్వరాజ్యం వచ్చేది. అందుకనే హా, విద్యార్థులకు "క్లాసుపుస్తకాలు చదవకండి. నిజమైనగ్రంధాలు——తన గ్రంధాలవంటివని ఉద్దేశం——చదవండి. లేకపోతే మీకూ, మిమ్మల్ని భరిస్తున్న దేశానికీ అరిష్టం కలుగుతుంది," అనిచెప్పాడు. ఆమధ్య పి.సి. రే కూడా ఇటువంటి మాటే అన్నాడు. ఇది చదివి మొదట బూజుగడ్డాల బూచులు గీర్వాణం పోతున్నా యనుకున్నాను. ఎంత నిజం! 15 సంవత్సరాలు ఎడారిలోని తుమ్మెదవలె తన్నుకుంటేగాని దానియదార్థం బోధపడలేదు. వెధవపరీక్షలు! ముష్టిపరీక్షలు! పోనీ, ఈ జన్మకిక పరీక్షల్లేవు షేక్స్పియర్ చేత సృష్టింపబడ్డ ఏరియల్, ప్రాస్పిరో ప్రాపకంవల్ల స్వాతంత్ర్యం సంపాదించి, ఏమన్నాడు?

"Where the bee sucks there suck I
In a cowslip's bell I lie
There I couch where owls do cry
On the bat's back I do fly.

ఆహా, స్వాతంత్ర్యం! ఇక నన్నుగురించి నా స్నేహితులు

జాలితలచ నవసరంలేదు. ఇక నేను నాజ్ఞానాన్ని అరికట్టుకో వలసిన అవసరంలేదు. ఇక నన్ను చూచుకొని నేను జాలితల చుకోనవసరంలేదు. ఈక్షణంనుంచే నా జీవితానికి పునాదులు వేస్తాను. ఏమి చెయ్యాలి ? ఏమీతోచటంలేదే. అయ్యో! ఎటు చూచినా ఉద్యోగాలే కనిపిస్తున్నాయి. ఈ చదువు సైతాను బుర్రను ప్రవేశపెట్టింది నాలోకి. ఎటు చూచినా సైతానుకి నరకమే కనుపించేది! ఎటుచూచినా నాకు ఉద్యోగాలే కనిపిస్తున్నాయి. ఒకవేళ నేనే ఒకపెద్ద ఉద్యోగాన్నేమో!

ఘోరం! ఘోరం! నా మెదడు పేలిపోతోంది. నాహృదయం హాంపీక్షేత్రమయి పోతోంది. నా ఉద్యోగాల భయంకర దృష్టినుంచి తప్పించుకోలేను ? ఈ ప్రపంచంలో నుంచి పారి పోతాను. నాసొంత ప్రపంచాన్ని ఒకదాన్ని నిర్మించుకుంటాను. దానికి కావలసిన వస్తుసామగ్రినంతా ప్రపంచాన్నుంచి బెల్లించి బెదిరించి సేకరిస్తాను.

అబ్బా 15 సంవత్సరాలు దుర్వినియోగం చేశాను.
ఎంత కసిగా ఉంది! !!

1936 లో వ్రాసింది.

# ఆంధ్రుల జాడ్యం

ఆంధ్రులకు తమను నిందించుకోవటం, ఇతరులను పొగడటం అనే నూతన జాడ్యం ఒకటి అంకురించింది. ఆవడదగ్గరనుంచీ ఏ. అరవవాళ్లో చెయ్యాలి, మనం తినాలి అనే స్థితిలోకి దిగింది మన సంగతి. ఈదారి పరకాయప్రవేశానికి తీసుకొనిపోతుంది అని ఎవ్వరైనా గొణిగితే, 'రాష్ట్రాభిమానం దురభిమానం' అని అంతర్జాతీయ మొహాలు వేస్తున్నాం. అంతర్జాతీయతను—దుర్బలత్వాన్ని, సోమరితనాన్ని, నిస్సహాయతనూ కప్పిపుచ్చే ముసుగుగా వాడుకొంటున్నాం.

మనలో ఫలానివాడు ఎవ్వర్నయినా విమర్శిస్తే. వెంటనే ఒకమూలనుంచి ఒక పెద్దమనిషి లేచి "ఎంతపనిచేశాడు! ఎంత ఘోరం చేశాడు?" అని ముక్కుమీద వేలు వేసుకుకోవటమో వీడి విమర్శనను ఖండఖండలుగా చేస్తానని కలంతీసుకోవటమో చేస్తాడు. ఒకప్రక్క ఫలానివాణ్ణి ఈ విధంగావిమర్శిస్తూనే, మరొకప్రక్క ఆ ఫలానివాడు ఎవ్వర్నో విమర్శించినందుకు కారాలు-లేకపోతే మిరియాలు-నూరతాడు. అతన్ని విమర్శించటానికి తనకెంత హక్కువుందో, ఇతరులను విమర్శించటానికి అతడికీ అంత హక్కుఉందని ఆలోచించడు.

ప్రతి ఆంధ్రుడూ ఈపనిచేస్తూనే ఉంటాడు. ఒకడు కలంతో విమర్శిస్తే, ఒకడు నోటితో విమర్శిస్తాడు. ఒకడు కరముమంచిగా విమర్శిస్తే, ఒకడు 'బేవారసు'గా విమర్శిస్తాడు. ఒకడు దేశశ్రేయస్సుకు విమర్శిస్తే, ఒకడు ఉదరప్రక్షాళనను విమర్శిస్తాడు. ఇక్కడ గుణం ప్రధానంకనక—రసంకాదు—ప్రతిఆంధ్రుడూ

ఈపని ఏదో ఒక విధంబుగా చేస్తూనేఉంటాను.

ఈవిమర్శకగుణం ఆంధ్రులకు పట్టుబడటానికి కారణమేమిటి? ఇతర దేశాల్లో ఇంతగా లేని ఈమర్యాద మనకు ఏ ఊదరవల్ల వచ్చింది?

ఆంధ్రుల్లో ఉద్రేకం, ఓర్వలేనితనం ఎక్కువని కొందరం టారు. అందువల్లనే బహునాయకత్వంతో ఏదో మోసిపోతుం దని గోలపెడతారు. పైకివెళ్లేవాణ్ణి కిందకుగుంజే ఆచారమే గాని, చేతికి అందినంతవరకు ఊతం ఇవ్వరని విచారపడతారు. ప్రతిఆంధ్రుడూ ఇలాగే మాట్లాడుతాడు. ఇక ఈ గుంజేవా డెవ్వడో? 'Man in the Street' కాబోలు!

ఇంతకూ మనలో ఉన్న దుర్గుణం ఏమిటి? ఆ దుర్గుణానికి దోహదమిస్తోన్న పరిస్థితులు ఏవి? అని ఎవ్వరూ ఆలోచించ డంలేదు. ఎవ్వరికివాళ్ళు వేదకాలంనాటి ముత్తుములమేననీ, ఎవ్వడో ఒకడు ఇదంతా చేసి మన దేశాన్ని మురికిగుంటలోకి లాగుతున్నాడనీ—అన్నట్లు నటిస్తున్నాం.

ఈ పై లక్షణాలన్నిటికీ విమర్శకజ్ఞానమే మూలకారణ మను కుంటాను. మనకి ఈ లక్షణం ఏ గాలికి వచ్చింది?

మన దేశంలో బలమైన మధ్యతరగతి ఉండటమే దీనికి కార ణం. ఈ మధ్యతరగతి ఉండటంవల్ల మేధశ్శక్తిలో కూడా క్రమేణా సమానత్వం కొంతవరకు ఏర్పడుతుంది. దీనివల్ల విమ ర్శకజ్ఞానం అలవడుతుంది. విమర్శించటానికి దుర్బలులనూ, అనా రోగ్యులనూ ఈర్ష్య ప్రేరేపిస్తే, శక్తిమంతులను సంఘశ్రేయస్సు ప్రేరేపిస్తుంది.

ఒక సంఘానికిగాని, ఒక దేశానికిగాని విమర్శ లేకపోతే

జనమే లేనట్లు. అటువంటి గుణం మన కున్నప్పుడు సిగ్గుపడటం ఎందుకు? విచారపడటం ఎందుకు? "ఆశక్తిని దుర్వినియోగం చేస్తున్నాం; మన తెలివితేటలు తప్పుదారిని పడుతున్నాయి," అంటారా? అయితే మంచిదారిలోకి తిప్పటానికి ప్రయత్నించాలిగాని సోదనలతో, చివాట్లతో, విసుగుదలతో, అగుణాన్ని చంపటానికి ప్రయత్నించగూడదు.

బహు నాయకత్వం ఉండటంవల్ల మన దేశానికి తీరని నష్టం ఏమీ లేదు. ఉన్నా మధ్యతరగతి మన దేశంలో ఉన్నంత కాలం—ఇది ఇప్పట్లో పోదు—*తప్పనిసరి అవుతుంది. ఈవిషయాన్ని రగడలోకి దింపి, నేరాన్ని ఎవ్వరిమీదో మోపి, పెదవి విరుపులతో కాలం వృథాపుచ్చేదానికన్నా, "ఆత్మ" పరీక్ష చేసుకొని, మన కౌశలాన్ని సక్రమ మార్గాలలో పెట్టుకోటానికి, మన దృష్టిని దోషభూయిష్ఠం చేసుకోకుండా ఉండటానికి, ప్రయత్నించటం శరీరానికీ దేశానికీ మంచిది.

* ఆంధ్రదేశంలో రైతువారీ పద్ధతి ఆచరణలో వుంటం వల్ల మధ్యతరగతి ఏర్పడింది. ప్రజాస్వామిక విప్లవం జరిగితేగాని, కేపిటలిజం వృద్ధిచెందితేగాని ఈ తరగతి పోదు. ఈ విషయం మనల్ని మనం విమర్శించుకునే ముందు జ్ఞాపకం ఉంచుకోవాలి.

# నాలోనివాడు

ఆరోజు నాకేమీ బాగాలేదు. ఆరోజే కాదు, బి. యస్‌. ప్యాసయి నప్పటినుంచీ ఇట్లాగే వుంది. పట్టా తీసుకునే రోజులు దగ్గరకు వొస్తున్నకొద్దీ ఈ బాగా లేక పోవటం మరీ ఎక్కువైంది. ఇక ఎల్లుండే ఎన్‌రోల్ అవ్వాల్సినరోజు.

ఆందోళనతో మనస్సు చీకాకు చీకాగ్గా వుంది. ఆలోచనల మీద ఆలోచనలు......

ఇదేం ప్రపంచం? కొందరు కేరింతలతో ప్రవేశిస్తున్నారు. కొందరు రోదనధ్వనులతో నిష్క్రమిస్తున్నారు. కొందరు దేవతలకు మల్లే ప్రేమలో మునిగి తేలుతున్నారు. కొందరు రాక్షసులకు మల్లే రక్తంలో ఈదులాడుతున్నారు. ధనాంధుల కలకలం, దరిద్రనారాయణుల కాకిగోల— గుసగుసలు, గిజగిజలు.

ఏమిటీ ప్రపంచం? దీన్ని ఎవ్వరు సృష్టించారు? ఎందుకు? ఎవరికోసం? ఆలోచించాను... ఆలోచించాను... ఆలోచించాను. ఆలోచించినకొద్దీ ఎవరో—సాయిబా—నా హృదయాన్ని దూది ఏకినట్లు ఏకుతున్నాడు. ఆలోచించటం వానికి ఇష్టం లేదని మానివేశాను. నా హృదయం, అంధకారంలోనుంచి వెలుగులోకి వచ్చినప్పుడు కళ్ళు రెపరెపలాడినట్లు, రెపరెప లాడింది. మరుక్షణంకోత...

సంఘంలో అనేకమందికంటే నేను అదృష్టవంతుణ్ణి. నన్ను వాత్సల్యంతో ఆదరించి నా తప్పులకు మురుసుకునే నాన్నగారు వున్నారు. నన్ను హృదయపూర్వకంగా ప్రేమించి నాశ్రేయస్సుని కాంక్షించే స్నేహితులున్నారు. నన్ను అర్థంచేసుకొని,

నా బాధలను—నా సుఖాలను నాకే వొదిలి—తనవిగా భావించుకునే హృదయేశ్వరి వుంది. నాకు మెదడు వుంది. కమ్మని హృదయంవుంది. కావలసినంత ఆరోగ్య ముంది. నా కెందుకీ అవస్థ?' అని ప్రశ్నించుకున్నాను.

జవాబు లేదు.

నాలోనివాడు, 'ఈ ప్రపంచం ఒక బందిఖానా. ఆబంది ఖానాలో ఈ శరీరం ఒక చిన్న బందిఖానా. అందులో నీవు బిక్క మొహంతో, గోళ్లుగిల్లుకుంటూ కూర్చున్నావు,' అన్నాడు.

నాకు భయం వేసింది. ఎప్పుడో నాజీవితం-నాకు తెలియకుండానే—కుళ్ళి పోయిన బంగినపల్లి మామిడిపండులాగు, ఎలెక్షన్ వ్యామోహంలో మురిగిన మానవుని హృదయంలాగు, అయిపోతుందేమో అని తారెత్తింది.

సిగిరెట్ ముట్టించాను. లాభంలేదు. పుస్తకంతీశాను—విక్టర్ హ్యూగో వ్రాసిన 'The Last Days of a Condemned Man' కంపరం పుట్టింది. జుట్టు పీక్కో బుద్ధి అయింది.

సినిమాకి వెళ్ళాను—ఫిలింబాగుంది—డైరక్షన్ అద్భుతంగా వుంది. కాని నా మనస్సు శాంతించలేదు. ప్రేమించుకోవటం, పైత్యించుకోవటం—ఇవేనా ఇప్పుడు మన దేశానికి కావలసింది? ఈ దౌర్భాగ్య దేశంలోని నగ్నకలహాన్ని ఈసినిమాలూ, పుస్తకాలూ ఎంతవరకు ప్రతిబింబిస్తున్నయ్? మళ్ళీ ఆలోచనలు—ఈనాటి బాల్‌జాక్, టాల్‌స్టాయ్, బెర్నార్డ్‌షా, గార్కీ...

ఇక అక్కడ ఒక్క క్షణం కూర్చోలేక పోయాను. బరువు హృదయంతో బయటకు వచ్చాను. ఒక పిల్లవాడు పొట్టకొట్టుకుంటూ, "బాబా, ఆకలి!" "బాబా, ఆకలి!" అన్నాడు.

నేను వాణ్ణి తేరిపారచూచాను. వాడు పద్యం మొదలు పెట్టాడు. దాని తాత్పర్యం చెపుతాను—

"మీరంతా చమురు వంకతో పట్నాలు వచ్చి వేలకు వేలు తగలేస్తున్నారు. సిగిరెట్లు వూదిపారేస్తున్నారు. కాఫీ తాగుతారు. సినిమాలకు వెల్తారు. భోగం కొంపల్లో జల్సా చేస్తారు. కాని నా సంగతి ఆలోచించరు...ఆలోచించరు...ఆలోచించరు."

నాకు వికారం కలిగింది. నాలోనివాడు ప్రశ్నించాడు—

"నీకింత ధనమిచ్చి, వాడికి దమ్మిడీ లేకుండా చేసింది ఎవ్వరు?"

"సంఘం" అన్నాను.

"ఎవరు సృష్టించారీ సంఘాన్ని?"

"మానవుడు"

"ఎందుకు? ఎవరికోసం?"

"మానవులకోసం."

"మరి ఇదేమిటి?"

నేను జవాబు చెప్పలేకపోయాను. ఏదో ఘోరపాపం—హత్యలే—చేస్తున్నట్లు బాధపడ్డాను.

"బిచ్చగవాడు, 'బాబా!' అని నా పాదాలు తాకాడు. ఆ స్పర్శకు నా శరీరం మంచుకి తాకినట్లు వణికిపోయింది. అక్కడ వుండలేక గబగబా బయల్దేరాను. నన్ను చూచి రిక్షావాలాలు 'రిక్షాసామి' 'రిక్షాసామి' అని పిలిచారు—వారికి నా మొహం—ఏ మొహం పెట్టుకొని చూపించను?—చూపించలేకపోయాను. శరీరమంతా గొంగళి పురుగులు పాకినట్లయింది. పరిగెత్తాను. ఒకటే పరుగు!!!

ఆ రాత్రి పన్నెండు గంటలకు కన్నుమూశాను. నేనూ ఆ

పిల్లవాడూ దేవుని దగ్గరకు వెళ్ళాం—"దేవా! నేను ప్రపంచంలో ఉండలేను. ఇంకొక ప్రపంచంలోకి తీసుకొనిపో," అని ప్రార్థించాను

ఆ పిల్లవాడు, 'ఆకలి... ఆకలి... బువ్వ పెట్టు!' అని గొణిగాడు.

దేవుడు నవ్వాడు. మమ్మల్నిద్దర్నీ దగ్గరకు రమ్మని పిలిచాడు. నేను నడవలేకపోయాను. ఆ పిల్లవాడు అడుగులు వేస్తూవుంటే, వాడి అంటిన డొక్కలు, "మా పొత్తు గిట్టక మరో ప్రపంచం కావాలంటున్నావా? మా పొత్తుగిట్టక మరో ప్రపంచకం కావాలంటున్నావా?" అంటూ ఎగిరిపడ్డవి. నేను ఉలిక్కిపడి లేచాను. మరో ప్రపంచకం కావాలన్నందుకు సిగ్గువేసింది. తలవొంచుకున్నాను.

2

తెల్లవారింది—దిగులుతో లేచాను దిగులుతో కాలకృత్యాలు తీర్చుకున్నాను. ఇక్కడ నాకొక స్నేహితుడున్నాడు. అతను అద్భుతమైన తెలివితేటలు గలవాడు. కాని అతని హృదయాన్ని సంఘం ముక్కలుముక్కలు చేసింది. ఒక్క ముక్క సోషలిజం అంటుంది. ఒక్క ముక్క జస్టిస్ పార్టీకి ఓటివ్వమంటుంది. ఒక ముక్క కళను సంఘశ్రేయస్సు ఆదర్శంగా ఉండాలంటుంది. ఒక ముక్క కళ, కళకోసమే అంటుంది. ఒక ముక్క దేవుడు ఉంటుంది. ఒక ముక్క శూన్యం అస్తి అంటుంది. యశోదమ్మకు శ్రీకృష్ణుని నోటిలో పద్నాలుగు లోకాలు కనిపిస్తే, నా మిత్రునిలో హిందూదేశం హిందూదేశ నాగరికతా కనిపిస్తాయి.

అతని దగ్గరకు వెళ్ళాను. అతను మరికొందరితో కలిసి

చిట్లాడుతున్నాడు. నాకదో ప్రపంచంగా కనిపించింది. ఆబల్ల ఆకాశం — ఆ చిల్లరడబ్బులు నక్షత్రాలు — నోట్లకట్టలు మేఘాలు—వారు దిక్పాలకులు.

"కూర్చో, చెయ్యిస్తాం," అన్నాడు.

"ఆడను," అన్నాను.

"అయితే ఇలా కూర్చొని ఈపజిల్ సాల్వు చెయ్యి," అన్నాడు మిత్రుడు.

"బైటికిపద." అన్నాడు నాలోనివాడు

"కొంచెం పనుంది. ఇప్పుడే వస్తాను," అని చెప్పి బయలు దేరాను

"ప్రపంచంలో వున్న పజిల్స్ సాల్వ్ చేస్తేచాలు," అన్నాడు నాలోనివాడు.

"ప్రపంచంలోని పజిల్స్ సాల్వ్ కావు. సోఫోనార్ ఏం చెప్పాడు? ప్రపంచంలోని సమస్యలు పరిష్కరింపబడవు. ఎందుకంటే సమస్యలు లేకపోతే ప్రపంచమేవుండదు గనక!" అని నేను జవాబు చెప్పాను.

కాని నాలోనివాడు ఇంతటితో వూరుకోలేదు. ఏవేవో ప్రశ్నలు వేస్తూనే వున్నాడు. నేను నాకు చేతనయినట్టు జవాబులు చెప్పుకుంటూనే వున్నాను. తనువు మాత్రంకీ ఇచ్చి వదలిన యంత్రంలాగు తనంతటానే ఎక్కడికో వెళ్తూవుంది.

తనువుకి ఒకబిచ్చగాడు అడ్డుతగిలాడు. "అయ్యా, సామీ!" అన్నాడు. అతడు వృద్ధుడు. పైగా దారిద్ర్యంతో ప్రతి అవయవం కృశించివుంది. వాడినుంచి తప్పించుకోటానికి వేగంగా నడిచాను, వాడు నా కార్పణ్యం కనిపెట్టి, "అయ్యా' సామీ,"

నాన్నగారు కనిపించారు. ఆయనఒకసారిఅన్నాడు—"మా వాడు లేకపోతే నా జన్మవృథా."

స్నేహితులు కసిరించారు. వారు అడిగేవారు—"ఎప్పుడు ప్రాక్టీసు పెడతారు?"

దృఢ సంకల్పంతో లేచి నల్లకోటు వేసుకున్నాను. పెట్టె తెరిచి వెయ్యిరూపాయలు జేబులో పెట్టుకున్నాను. నాగదిలోని నల్లపిల్లి భయం భయంగా నాచుట్టూతిరిగి, జాలిగా చూచి, "మ్యావ్, మ్యావ్" అన్నది.

"ఛీ" అని విదిలించాను.

పాపం వెళ్ళిపోయింది.

నేను ఉన్నాబై హైకోర్టుకి బయలుదేరాను. నాలోనివాడు మాట్లాడలేదు. జయించానని గర్వపడ్డాను. హైకోర్టు గేటులో ఠీవిగా అడుగుపెట్టాను,

"బాబూ!" బాబూ!—ఎవ్వరో పిలిచారు.

దొంగలాగా బెదిరి, వెనుదిరిగి చిత్తరిచూపులు చూశాను.

"బాబూ! బాలింతరాలిని. అయిదురోజులనుంచీ దారకం లేదు... చంటిది చచ్చిపోతావుంది ..నావాళ్లు అగ్గిరాగామండి పోతావుంది," అని జ్వరం నాటుమన్నట్లు మెడచాచి, చెంప అందించింది.

నేను ఆమెను చూడలేకపోయాను. ఆమె వొంటిమీద ఎక్కడ గుడ్డవుందో, ఎక్కడ లేదో నేను చెప్పలేను. చేతిలోని కసిగందును చూశాను. శరీరం ఘుచ్చెమటలు పోసింది. బుద్ధునికి బోధి చెట్టుకిందా, మహాత్మునికి బోగంకొంపలో కలిగిన జ్ఞానం నాకీ బాలింతరాలిమూలను కలుగుతుందేమో అని భయం

తోచింది.

హైకోర్టువైపు మొహం తిప్పాను. అది ఒక వటవృక్షంలాగు కనిపించింది. నల్లకోట్లతో తిరిగేవారు. ఆ వటవృక్షాన్ని పట్టు కొని వేళ్ళాడే గబ్బిలాల్లాగు కనిపించారు. మరుక్షణం అదొక ప్రత్యేక ప్రపంచంలాగూ, ఆ నల్లకోట్లతో తిరిగే అడ్వొ కేట్లు మేఘాల్లాగూ కనిపించారు. దేశానికి ఉపయోగపడే యువకులను ఎంతమందిని తన పొట్టని పెట్టుకుంటూ వుంది ఈ యంత్రం!!

"ఛీ!" అనుకున్నాను.

ఇంతలో హృదయేశ్వరి జ్ఞాపకం వచ్చింది.

నాన్నగారు జ్ఞాపకం వచ్చారు.

స్నేహితులు జ్ఞాపకం వచ్చారు.

ఒకసారి ముందుకు చూశాను.

"జాగ్రత్త," అన్నాడు నాలోనివాడు.

"బాబూ," అన్నది బాలింత రాలు.

"క్యాఁ" మన్నది కసిగందు.

ఆ ధ్వని చురకత్తికంటే పదునుగా నా హృదయంలోకి దిగింది. నా కళ్ళల్లో నీరు తిరిగింది. నన్ను చూచి ఆ బాలింత రాలు, "బాబూ, బాబూ!!" అంటూ తనుకూడా కంటతడి పెట్టు కొంది.

అకస్మాత్తుగా జేబులోవున్న వెయ్యిరూపాయిలు నా కళ్ళ ముందు తాండవించినై. వాటి బరువుతో, ఆశతో మొయ్యలేని బరువును నెత్తిని పెట్టుకున్న కూలిదానిలాగు, కుంగిపోయాను. ధైర్యంగా, వణుకుతున్న చేతిని జేబులోకి పోనిచ్చాను.

"ప్లీజ్ గో!" అన్నది హృదయేశ్వరి.

"నా జన్మ వృథా!" అన్నారు నాన్నగారు.

ఎప్పుడు? ఎప్పుడు??" అన్నారు స్నేహితులు.

నా చెయ్యి జేబులోకి పోలేదు. అలాగే వేలాడబడిపోయింది.

"జాగ్రత్త" అన్నాడు నాలోనివాడు.

"బాబూ, బాబూ." అన్నది బాలింతరాలు.

"క్యార్" మన్నది కసిగందు.

నాకు ప్రపంచమంతా శూన్యంగా కనిపించింది. ఒకడుగు ముందుకు వేశాను. నాలోనివాడు గిజగిజా తన్నుకున్నాడు. నేను ఒక స్ఫూర్తితో హైకోర్టులోకి తనువుని జేరవేశాను.

"ఓ!" అని అరిచాడు నాలోనివాడు. నాలో ఏదో పగిలి ముక్కలు ముక్కలైంది. నాలోనివాడు మరణించాడా?

## మానవ జీవితం

ఒక రోజు పొద్దున్నే దేవుడు లేచి మొహం కడుక్కొని జవాన్ని పిలిచాడు. రెండు మూడుసార్లు పిలిచినా, ఎవ్వరూ జవాబివ్వ లేదు. అప్పుడు దేవునికి, డబ్బులేక పోవటంవల్ల ఎస్టాబ్లిష్ మెంటు తగ్గించిన సంగతి జ్ఞాపకంవచ్చి, విచారంగా కూర్చు న్నాడు. కొంతసేపయిం తర్వాత ఒక జవాను ప్రవేశించాడు. అతన్ని చూచి దేవుడిలా ప్రశ్నించాడు...

"మర్త్యలోకం నుంచేనా?"

"చిత్తం" "ఏమిటి సంగతులు?"

"అంతా అనుకూలంగానే ఉందండీ! మానవుడు సగంజీవి తం నేర్చుకోవటంతోనూ, మిగిలిన సగం తాను నేర్చుకుంది తప్పని తెలుసుకోవటంతోనూ, గడుపుతున్నాడు......" అన్నాడు జవాను. "మంచిది కనక ఇప్పట్లో మనకేమీ పర వాలేదన్నమాట! ఇంకా కొన్నాళ్ళవరకూ మనభుక్తికిలోటు లేదన్నమాట..." అని పలికాడు దేవుడు.

# భాషలో విప్లవం

ఆటలు వ్యాయామం కోసం ఏర్పడ్డవి. కాని నేడు క్రికెట్, టెన్నిస్, బాక్సింగ్ మొదలయిన ఆటలు ఒక కళగా, ఒక వృత్తిగా తయారయినవి. "బ్రాడ్‌మన్ సెంచరీల పరుగులు తీశాడు, పెర్రీ వరుసగా ఇరవై సెట్లు గెలిచాడు. గామా, జిబిస్కో, ష్మెలింగ్ దవడ బద్దలకొట్టాడు," అని సంతోషిస్తున్నాం. ప్రాణాలను నిలబెట్టటానికి భోజనం ఏర్పాటు చెయబడింది. ఎక్కువ తిని ప్రాణాలమీదికి తెచ్చుకుంటున్నాం. భాషకూ ఈ గతే పట్టింది. అది ఎందుకుపుట్టిందో, దాని ప్రయోజనం ఏమిటో మరచిపోయాం. దానికి మెరుగులు పెయ్యటం, నగిషీలు చెక్కటం, రంగులు పుయ్యటం జరుగుతోంది. దీనివల్ల భావం మరుగున పడిపోవటం, అనుకున్న భావం అనుకున్నట్టుగా వ్యక్తం కాకపోవటం, జరుగుతోంది

భాష ఈస్థితికి ఎందుకువస్తుంది? సంఘంలో మార్పు లేక నూతనభావాలు పుట్టనప్పుడు భాషకు వాపు ఏర్పడుతుంది. చెప్పిందే చెప్పవలసిరావటం వల్ల రచయితలు భాషకు సాము గరిడీలు నేర్పి తమ ప్రతాపం చూపుతారు. భాషచేత సర్కస్ చేయించి. ప్రేక్షకులను ఆకర్షించి కరతాళధ్వనులకోసం ప్రయత్నిస్తారు. మనభాషలోని, "రాజనందన రాజ రాజాత్మజులు సాటి" మొదలయిన పద్యాలూ, ఏకాక్షరులూ, ద్వ్యక్షరులూ, త్ర్యక్షరులూ ఈవిధంగానే బయలుదేరాయి... ఈ కారణంవల్లనే ఒకరు నిర్వచనోత్తర రామాయణం రాస్తే, ఒకరు ఉత్తర రామాయణం రాస్తారు. ఒకరు రామాయణంరాస్తే ఒకరు అచ్చ తెనుగు

రామాయణం రాస్తారు. ఒకరు నృసింహపురాణం రాస్తే ఒకరు నారసింహపురాణం రాస్తారు. ఒకరు రాఘవుని చరిత్రా, పాండవుని చరిత్రా వేరువేరుగా రాస్తే, ఒకరు రాఘవపాండవీయం రాస్తారు. ఈ అవస్థ భావదారిద్ర్యంవల్ల ఏర్పడుతుంది.

"ఏమిటీ సారంగామా?" అని ఎవ్వరయినా ప్రశ్నిస్తే "ఇది గ్రంథాగ్రస్థమైనభాష" అనో, "షెల్లీ, పండితప్రకాండులకే వ్రాస్తానన్నాడూ" అనో, కళోపాసకునికి వీలైనంత చేరువై, అతని భాషనూ, సాంకేతికాల్నీ అంగీకరించి, అతనిసృష్టిలోనిరసాన్ని ఆస్వాదించాలి" అనో చెప్పి రచయితలు తప్పించుకోవలసి వస్తుంది.

ఈ వైగ్రితలలను సమర్థించుకోటానికివీరుఇంకొక పనిచేస్తారు. "కళకోసమే కళ" అనేవాదాన్ని లేవదీస్తారు. కళ ఎందుకు పుట్టింది? కళకోసమే పుట్టింది. టెన్నిస్ ఎందుకు ఆడుతున్నారు? ఆడటంకోసమే ఆడుతున్నారు. లూయీ, షెమ్లింగ్ దవడ ఎందుకు బ్రద్దలగొట్టాడు? బ్రద్దలగొట్టటంకోసమే బ్రద్దలగొట్టాడు, అనే వాదం లేవదీస్తారు.

కాని ఈ వితండవాదం ఎవ్వరికి నచ్చుతుంది? ఎరువుకాళ్ళ మీంద ఎన్నాళ్ళినిలబడుతుంది? ప్రజాసామాన్యం. "భాష, మానవులు ఒకరి భావాలు ఒకరు తెలుసుకోటానికి ఉపయోగించే ఒక సాధనంగదా! ఇప్పుడు మీరు చేస్తున్న పనేమిటి?" అని ప్రశ్నిస్తుంది.

ఈ ప్రశ్నకు సమాధానంగా రచయితలు మాటిమాటికీ "ప్రజాసామాన్యం" "ప్రజాసామాన్యం" అంటున్నావు. "ప్రజాసామాన్యం" అంటే ఎవ్వరు? అని తిరుగప్రశ్న వేస్తారు. కనుక

ప్రజాసాహిత్యం ఎవ్వరికి చెప్పాలి.

ప్రథమంలో ఆర్యజాతి ఒక్కటే సాహిత్యాన్ని సృష్టించింది. అప్పుడు కవి ఋషులు ఆ జాతికి నచ్చే భావాలు దాన్ని ఆకర్షించే రూపంలో— వైదిక వాఙ్మయం— వ్రాశారు. రాజులు "రసికులై" వున్నంత వారి రుచులకు అనుగుణంగా వారికి నచ్చే భాషలో— ప్రబంధాలు— వ్రాశారు. తరువాత బూర్జువా వర్గం సాంఘికంగా వృద్ధి చెందింది. అప్పుడు వారికి అర్థమయ్యే భాషలో వారికి ఆనందాన్నిచ్చే భావాలతో బూర్జువా కవిత్వం— భావకవిత్వం——వ్యావహారిక వాదం బయలు దేరినయ్. ఇప్పుడు శ్రామిక వర్గంలో చదువు వ్యాపిస్తోంది గనక వారికి అర్థమయ్యే భాషలో, వారి సమస్యలను పరిష్కరించే భావాలతో, సాహిత్యం [illegible].

కాని ఈ పరిమాణాన్ని గ్రహించగలిగే [illegible] దృష్టి వున్నవాడు మాత్రం ఇంతవరకు [illegible].

చదువుకున్న వాళ్లల్లో ఎక్కువమందికి అర్థమయ్యేట్లుగా, నచ్చేటట్టు రాయటానికి ప్రయత్నించేమాట నిజమే! కాని ప్రస్తుతం ఆ వర్గానికే నచ్చే భావాలను వెలిబుచ్చుతున్నారు.

అంటే బూర్జువా నాగరికత ప్రచారంలో వున్న [illegible] కవి ఆ భావాలనే ప్రచారం చెయ్యక, తరువాత రాబోయే వర్గానికి లాభాన్నికూర్చే భావాలను, చదువుకున్న వర్గానికి నచ్చే భాషలో ప్రచారం చేస్తాడు అంటే తరువాతి వర్గంలో చైతన్యం కలిగించి విప్లవం లేవదీస్తాడు. తరువాతి వర్గంలో అప్పటికి ఎక్కువ చదువు లేకపోయినా, చదువుకున్న వాళ్లు ఉపన్యాసాల ద్వారానో మరే విధంగానో చెపుతూవుంటే విని గ్రహించుకునే స్థితిలో వుంటుంది గనక ఈ పని జరుగుతుంది.

కనుక భాషయొక్క ప్రయోజనం ప్రజాసామాన్యానికి భావాలు అర్థమయ్యేటట్లు—నచ్చేటట్లు—చెప్పటం. ఈ ప్రయత్నం ఫలించటమే కళ. మనం మాట్లాడుకొనేటట్లు రాయమనటం నిజమే! మాండలికభేదాలుండేమాట—ఉపరిస్థితుల్లో—నిజమే! కాని మనం అందరికీ అర్థమయ్యేటట్లు మాత్రమే వ్రాయగలం. గనుక భాష "మానవులు ఒకరిభావాలు ఒకరు తెలుసుకోటానికి ఉపయోగించే ఒక సాధనం," అని చెబుతాను.

"అయితే పూర్వం ఎప్పుడో మనుష్యులు భావాలను సంజ్ఞలతో తెలుసుకునేవారట! ఇప్పుడు కొందరు అభినయంద్వారా భావప్రదర్శనం చేస్తున్నారు. ఇంకా అనేకరీతులు భావప్రదర్శనం జరుగుతోంది. ఇవన్నీ భాషలోకే వస్తాయా?" అనే ప్రశ్న వస్తుంది.

రావు. అందుకనే 'ఒక సాధనం' అన్నాను.

నే నీవ్యాసంలో భావం అంటే ఏమిటో, ఎటువంటి భావం గ్రంథార్హమో చర్చించలేదు. వాఙ్మయం ప్రయోజనకారిగా ఉండాలన్నప్పుడు ప్రయోజనం అంటే ఏమిటో నిర్వచనం చెయ్యలేదు. భాష, శ్రామికులకు భావాలను అర్థంచేసేదిగా మారటం వల్ల అది ఆవర్గానికి చెందింది కాకుండా ఏవిధంగా పరిణామం పొందుతుందో వర్ణించలేదు. భాషప్రయోజనమేమిటో, ఇప్పుడది ఏవిధంగా దుర్వినియోగం చెయ్యబడుతూవుందో, వ్రాశాను.

"ఏం జరుగుతుంది?" అని చరచరా వంటింట్లోకి వెళ్ళింది.

నేను భారంగా అడుగులు వేస్తూ నా గది ప్రవేశించాను. 'ఏమిటీ బాధ?? అర్థంకాని, సహించలేని ఈ బాధ —' అని తీవ్రంగా ఆలోచించాను — ఆలోచిస్తున్నకొద్దీ, తల పగిలిపోతూవుంది — గంటలు గడిచిపోతున్నాయి — కాని నా బాధ పోనూ పోదు, అర్థం కానూ కాదు.

ఆ సమయంలో నా భార్య నెమ్మదిగా వచ్చి నన్ను పలకరించింది.

"చిట్టేది?" అని ఘట్టిగా ప్రశ్నించాను.

నా మాటల ధ్వనికి నాకే ఆశ్చర్యమేసింది. నా భార్య బెదిరిపోయింది. అప్పుడు నా ముఖం ఎలా వుందో నేను చెప్పలేను గాని నా భార్య మాత్రం, ఒక భూతాన్ని చూచినట్లు నా గదిలోంచి పారిపోయింది.

నేను మళ్లీ కుర్చీలో కూర్చున్నాను. తల చేతుల్లో ఇరికించుకున్నాను. నాలో ఏదో ఒక వింత ఆవేశప్రవృత్తి బయటపడటానికి తంటాలు పడుతున్నట్లుగా అనుమానం కలిగింది.

ఏమిటిది? ఆఁ!...ఆఁ?... తెలిసింది.

మధ్యాహ్నంనుంచీ నాలో జరుగుతూవున్న సంఘర్షణకి అర్థం నాకిప్పుడు గోచరించింది. తెలిసి సిగ్గుతో నవ్వుకున్నాను. నేనింత చీకాకుపడి బాధపడటానికి కారణం ఏమనుకున్నారు? నాకొక కథొచ్చింది! నా హృదయం నాలో కథను బయటపెట్టటానికి ఉదయాన్నుంచీ ప్రయత్నిస్తూవుంది. ఆ క్రియ యత్నాన్ని సరిగ్గా గ్రహించలేక ఇంత బాధ పడ్డాను. చెప్పుకుంటే సిగ్గుచేటు!

వెంటనే కలం తీసుకున్నాను. కాగితాలు తీసుకున్నాను. టేబుల్ ముందుకి లాక్కున్నాను. "కథ రాయాలి" చిన్నకథ రాయాలి! బుల్లికథ రాయాలి!" అని కృతనిశ్చయంతో కాగితం మీద కలం పెట్టాను—కాని మరో బాధ!

కథ ఎలా వ్రాయాలి? ఏవిధంగా మొదలుపెట్టాలి? ఏవిధంగా అంతం చెయ్యాలి? ఏదో క్లైమాక్సు అంటారే? దాన్నేవిధంగా తీసుకురావాలి?

నేనిప్పటికి కథలు వ్రాయకపోయినా, అవి ఎలావుండాలో, వాటి లక్షణాలేమిటో, చాలా గ్రంథాల్లో చదివాను. ఒక గ్రంథకర్త యిలా వ్రాశాడు:—"ప్రబంధ కవిత్వానికీ భావ కవిత్వానికీ ఎంత తేడావుందో నవలకూ కథకూ అంత తేడావుంది. భేదంకూడా ఒక్కటే! కథకు ఆవేశం ముఖ్యావసరం," అని వ్రాశాడు.

నేను దీన్నిబట్టి కథ వ్రాయటానికి కలం కాగితాలకంటే ఆవేశం ముఖ్యమని గ్రహించాను. కాని యీ ఆవేశం ఎలా వస్తుంది? నిన్న కథకులు ఎల్లా తెచ్చుకో గల్గుతున్నారు?

ఈసారి కలం పెదవికి ఆనించి మరీ ఆలోచించాను. ఏమీ తోచక నిరాశగా, కిటికీలోంచి బైటికి చూశాను. బైట పండు వెన్నెల! పూలమొక్కలు సువాసనలు విరజిమ్ముతున్నాయి. చల్లగాలి వీస్తుంది—కథకుల రహస్యం నాకప్పుడు బోధపడింది—కథకు కావలసిన ఆవేశం ఎలా వస్తుందో నాకపుడు తెలిసింది. ఆవేశం కలగటానికి తగిన వాతావరణం కావాలి.

"వాతావరణం కావాలి—వాతావరణం కావాలి" అనుకొంటూ కలం చెవులో పెట్టుకొని కాగితాలు చంకలో పెట్టు

కొని, కుర్చీ చేత్తోపట్టుకొని తోట్లోకి పరుగెత్తాను.

దారిలో మా నౌకరు నన్నుచూచి, నా అవస్థచూచి, నా అవతారంచూచి నిలువుగుడ్లు వేసి స్తంభించిపోయాడు. 'పాపం! కళాహృదయం వేయించే గంతులు, చేయించే చేష్టలు—యీ అమాయిక హృదయానికి ఏమర్థమౌతాయి?—' అనుకుంటూ తోట ప్రవేశించాను.

తిరిగ్గా కుర్చీ వేసుకొని కాగితాలు ముందు పెట్టుకొని, కలం చేతిలో పట్టుకొని, కళ్ళుమూసుకొని తదేక ధ్యానంలో ఆవేశం కోసం ప్రయత్నిస్తూ కూర్చున్నాను—ఆ చల్లగాలిలో, ఆ పండు వెన్నెల్లో, ఆ ప్రకృతి శోభలో ఆవేశం రాక ఏంచేస్తుంది?

హఠాత్తుగా, సముద్ర కెరటంలాగా, నీటి జలలాగా, మలేరియా జ్వరంలాగా, ఉబుకుతూ ఉబుకుతూ రానేవచ్చింది—వెంటనే కలం కాగితం తీసుకొని నా మొదటికథ వ్రాయటానికి ఉపక్రమించాను:—

అది కటికిచీకటి—ఆకాశం మేఘావృతం—ఆ తోట నిర్మానుష్యం—అంతా నిశ్శబ్దం. (ఇక్కడ మూడుచుక్కలు, మళ్ళీ కథ)...ఆకులు గలగల ధ్వని. మోహనరావు [illegible]గులో అడుగు వేసుకుంటూ ప్రవేశించాడు—తోటలోని పూల మొక్కలు అతన్ని ఆహ్వానించాయి. ప్రకృతి యావన్మాత్రం కదలక మెదలక కన్నీటిబొట్లు రాల్చాయి, (మళ్ళీ మూడుచుక్కలు... మళ్ళీకథ) అప్పటికప్పుడే రాధ అశోకవృక్షం క్రింద మోహనరావుకై నిరీక్షిస్తూ, తపిస్తూ, కూర్చునివుంది—మోహనరావు గప్‌చిప్‌గా ఆమెను సమీపించి తన కరపల్లవాలతో ఆమె నేత్రపద్మాలను మూసి ఏమన్నాడో చూశారా??—

కౌగలించుకుంటారు కదా? కౌగిట్లో ఉన్నప్పుడు ఆ స్త్రీ మనస్తత్వం ఎలా ఉంటుంది? ఏంచేస్తుంది? ఏమంటుంది?" అని లాలనగా అడిగాను.

మొదట్లో సిగ్గుపడింది. తర్వాత కోపగించింది—"ఏమిటండీ ఇవేమాటలు! ఇంతకంటే మనకు వేరే పనేముంది?" అని విదిలించుకుంటూ వెళ్ళిపోయింది.

నాకేమీ తోచలేదు. చంద్రుడు వెన్నెల కాస్తూనే ఉన్నాడు. చల్లగాలి వీస్తూనేవుంది. ప్రకృతి ప్రకాశిస్తూనే వుంది. కాని నాకుమాత్రం ఆవేశం రావటంలేదు. కౌగిట్లో అతుక్కుపోయిన నాయికా నాయకుల్ని ఏంచెయ్యాలో తోచటంలేదు. బలాత్కారంగా విడదీస్తే మాత్రం విడిపోయి ఏంచేస్తారు? ప్రేమించుకున్నవాళ్లు 'నా హృదయమా! నా ప్రాణేశ్వరా!' అనటం కంటే ఇంకేం చెప్తారు?

కలం విసుగ్గా క్రిందపెట్టాను. తోట్లోకి నడిచాను. చంద్రుడు చెట్లసందునుంచి వెక్కిరిస్తున్నాడు. చెవులు గింగురు మనేటట్లుగా గాలివీస్తుంది. కాగితాలు రెపరెపలాడిపోతున్నాయి.

"నాన్నా" అనేపిలుపు వినిపించింది.

తిరిగిచూచా! చిట్టి నెమ్మదిగా దగ్గరకొచ్చింది. ఇదివరకంత చనువుగా దగ్గరకురాక, బెరుగ్గా, భయంగా, కొంచెం దూరంగా నిలబడి "అమ్మ రమ్మంది" అంది. "రండి నాన్నా! తేళ్ళూ పాములూ ఉంటై చీకట్లో" అంది.

"కథపూర్తిచేసి వస్తానమ్మా," "అన్నాను.

ఈమాటవిని చిట్టి కళ్ళు ఇంతింతచేసి, అమాయకంగాఅడిగింది:—"అసలు కథలువ్రాయటం ఎందుకు నాన్నా?"

"[illegible] మహాత్మ్యం [illegible]" అనే జవాబు నోటిదాకా వచ్చింది. కాని ఆ [illegible] ఈ గొప్పవిషయాలు అర్థంచేసుకోడానికి ఆయువు చాలదని పస్తాయించి ఊరుకొన్నాను.

"పోనీ, ఇంట్లోకి వచ్చి రాసుకో నాన్నా?"

"నువ్వెళ్ళు చిట్టీ! నాకిక్కడుంటే కాని ఆవేశం రాదు."

"ఇదేమిటి నాన్నా? అలాఅంటావు? చలిగాల్లో ఉంటే జలుబు చేస్తుందిగాని ఆవేశమొస్తుందా?"

నాకామాట వినేటప్పటికి కోపమొచ్చింది.... మళ్ళీ నేనూ నా ఆలోచనా, నా పండువెన్నెలతోయారు! ఈసారి ఎంతసేపాలోచించినా చెప్పలేను. కోటసంగతి మరచిపోయాను. వెన్నెల మరచిపోయాను. మలయమారుతం మరచిపోయాను. శూన్యహృదయంతో, స్మశానవైరాగ్యంతో కూర్చున్నా.

నేను ప్రపంచాన్ని మరచిపోయిన యీ స్థితిలో దగ్గరగా కేకలూ, ఏడుపులూ, బొబ్బలూ వినిపించినై. ఉలిక్కిపడి కంగారుగా [illegible]ను.

నలుగురు మనుష్యులు—"పాము! త్రాచు! నల్లత్రాచు! అడ్డంరాకండి!" అని కేకలు పెట్టుకుంటూ వస్తున్నారు.

నా శరీరం వణికింది: గుండెలు దడదడా కొట్టుకున్నాయి—గొంతులో గురగురమంటూ—"అమ్మో!" అని అప్రయత్నంగా వెర్రికేకవేసి గభాల్న కుర్చీనెక్కి నిలబడ్డాను. కలం దూరాన పడిపోయింది. కాగితాలెగిరిపోతున్నాయి.

అందుకోటానికి ముందుకొంగాను. ఇంకేముంది? కుర్చీ మీదనుంచి కాలుజారింది. విరుచుకుపడ్డాను.

కథ కంచికి వెళ్ళింది. నేను మంచమెక్కాను.

# ఏది ఉత్తమ రచన?

"అతని పుస్తకం బాగా లేదు," అంటారు పాఠకులు.

"నేను రాసింది మీ కోసం కాదు," అంటాడు రచయిత.

చదువుతున్న వాళ్ళకోసం కాదు రాసింది అనటం సాహసమే! కాని, తాను కష్టపడి, బుర్ర బద్దలుగొట్టుకొని, రాత్రింబగళ్ళు కష్టపడి రాసింది 'బాగా లేదు' అని చప్పరించే టప్పటికి వొళ్లు మండిపోతుంది. రచయిత ప్రజలకు రుచించాలనే రాస్తాడు. పదిమంది చేతా బాగుం దనిపించుకొని సంతోషించాలనే రాస్తాడు — పేరు సంపాదించుకోవాలనే రాస్తాడు.

కాని తాను రాసింది బాగా లేద నేటప్పటికి వెంటనే ఈ మాట అనేస్తాడు— "నేను రాసింది మీకోసం కాదు"

"మరెవరికోసం?"

రచయిత తెలివిగలవాడు అవటంవల్ల ఈ ప్రశ్నకు సమాధానాలు వెతుకుతాడు.

"నేను రాసింది రసహృదయులకు"

"నేను రాసింది సహృదయులకు"

"ఈ రసహృదయులూ, సహృదయులూ ఎవ్వరు?" అని ప్రశ్నిస్తే తాను రాసింది బాగుంది అని చెప్పేవారే అని తేలుతుంది.

ఇదంతా చూస్తుంటే, ఈ [illegible] తన ప్రయత్నం నిష్ఫలమైందనే ఆశాభంగంవల్ల కలిగినవే గాని, యథార్థమైనవి కావు. తాను అనేక పుస్తకాలు చదివాడు. తన కాలాన్నంతా చదువుకే వెచ్చించాడు. ఆర్థికంగా అనేక కష్టాలుపడ్డాడు. సంపా

అచ్చువ్వాలి! గ్రంథకర్తగా పేరుపడాలి! నేను మామూలోణ్ణి కాను అనే తపనే తప్ప ప్రజలకు అర్థమయ్యేట్లు రాయాలనే సంగతే తట్టదు.

పుస్తకాలు రాసి పేరు సంపాదించుకున్న వాళ్ళని చూస్తాం; పేరు సంపాదించుకోని సన్మానాలు పొందేవాళ్ళని చూస్తాం; మనకూ పుస్తకం రాయాలనే కుతూహలం కలుగుతుంది. అభిమాన రచయితల్ని అనుకరిస్తాం. బొత్తిగా కాపీకొట్టం మనస్కరించక ఒక రచయిత టెక్నిక్కూ, ఒక రచయిత భావాలు తీసుకొని మిక్స్ చేసి పుస్తకాన్ని పూర్తిచేస్తాం. పై ఇద్దరికంటే మంచి పుస్తకం రాశాం అనుకుంటాం.

ఈ విధంగా భావాలూ రచనాశక్తి తెచ్చుకుంటాం. ఇక శైలి విషయం వస్తుంది. ఇదివరకు రాసే అలవాటు లేకపోవటంవల్లా అనుభవం తక్కువ అవటంవల్లా మన శైలి మనకే తృప్తికరంగా ఉండదు: పేలవంగా ఉంటుంది; కుంటుపడ్డట్టుగా ఉంటుంది.

ఏం చెయ్యాలి?

తేలిక పద్ధతులకు అలవాటుపడ్డ ప్రాణం అవటంవల్ల మరొక తేలికపద్ధతి ఆలోచిస్తాం. మనం చదివిన పుస్తకాలు తిరగవేస్తాం. మంచి మంచి మాటలూ, సమాసాలు ఏరుకుంటాం. మన పుస్తకంలో కుక్కి సొంతం చేసుకుంటాం.

అందువల్ల శైలి ఒక రకంగా ఉండదు. పేజీ పేజీకి మారుతుంది. పేరాగ్రాఫ్ పేరాగ్రాఫ్‌కీ మారుతుంది. ఎవ్వరైనా ఈ లోటు చూపిస్తే దిద్దుకోటానికి ప్రయత్నించక ఒక కారణం ఊహించి టపీమని వాడి మొహాన విసిరికొడతాం.

“రసాన్నిబట్టి శైలిని మార్చానోయ్! గ్రహించకలేకపోతే

ఉద్యోగించక లేకపోతే—ఊరుకో." అంటాం."

ప్రతివాడు మనస్సులో అనుకోవలసిందేదో అనుకొని, పైకి మెదలకుండా చూసుకుంటాడు. మనమేమో. 'గెలిచాం; నోరు మూయించాం;' అని భుజాలు ఎగరవేస్తాం.

ఇక, పుస్తకం అచ్చయిపోస్తుంది. మనం రాసిందే పదేపదే చదువుకుంటాం-ఎన్నిసార్లు చదివినా తనివితీరందే! పైగా రాసినప్పటికంటే, అచ్చయిం తర్వాత ఇంకా అందంగా కనిపిస్తుందాయెను!

గ్రంథకర్తగా అచ్చయిన మనపేరు మనల్ని ఎంతగా ఆకర్షిస్తుంది! ఎన్నిసార్లు చదువుకుంటాం! ఎన్నిసార్లు చూచుకుంటాం! ఆపేరు—మనపేరే!—ఎక్సర్‌సైజ్ పుస్తకాలమీదా, పరీక్షపేపర్లమీదా, టెక్స్టుబుక్కులమీదా. ముద్దుగా, బండగా, గొంగళి పురుగులాగా కనబడే ఆ పేరే, ఇప్పుడు గ్రంథకర్తగా ఎంత ముద్దులొలుకుతూ కనిపిస్తుంది! ఆ స్థితిలో రచయిత తనకు తానే. తనపేరునే మోహిస్తాడు—కామిస్తాడు—కాదు ప్రేమిస్తాడు. పుస్తకంమీద పేరుని చూచుకొని, పుస్తకాన్ని రొమ్ముమీద పెట్టుకొని నిద్రపోయి, రెండు రాజహంసలు తనపేరుని తలొక చివరా ముక్కుల్లో సుతారంగాపట్టుకొని, దివ్యాన ఎగిరి, ముత్యాలహారాన్ని పట్టుకపోతున్నట్టుగా, స్వర్గానికి ఎత్తుకపోతున్నట్లు కలలు కంటాడు.

ఈ అవస్థలో ప్రజలకు తావేముంది! ఈ పుస్తకాన్ని ప్రజలు ఆదరించకపోవటంలో ఆశ్చర్యమేముంది? ఆర్గుమెంట్సు చెప్పటం వల్లా. ప్రజలను నిందించటంవల్లా ప్రయోజనం ఏముంది?

ఎవరయినా కనిపిస్తే "నా పుస్తకం ఎలావుంది?" అని అడగటా నికే భయం వేస్తుంది. బాగులేదంటే! అందుకని ఎలావుందని అడక్కుండా —మనస్సు ఒకపక్క పీకుతున్నా సరే — పిచ్చాపాటీ మాట్లాడి అందుకి అవకాశం ఇవ్వకుండా చూసుకుంటాం. లేక పోతే, మనం ఏంరాసినా బాగుంటుందని చెప్పే స్నేహితుల్ని పట్టుకొని అడుగుతాం. "నా పుస్తకం చదివావా?"

"చూశాను" అంటాడు

చదివావా? అని అడిగితే 'చూశాను' అని చెప్పినందుకూ, "ఎలావుంది? అని అడక్కుండానే 'బాగుంది' అని చెప్పినందుకూ, విసుగు పుడుతుంది. విసుక్కుంటూనే "ఎలావుంది" అని అడుగుతాం.

"బాగానేవుంది" అంటాడు.

"బాగానేవుందా? బాగుందా?"

"బాగుంది"

"బాగుందా? చాలా బాగుందా?"

"చాలా బాగుంది"

ఈ విధంగా చెప్పించుకొని తృప్తిపడతాం. ఇక ప్రజలకు నచ్చలేదు అనడంలో అర్థంలేదు. అందుకు ప్రయత్నమేదీ? ఇదొక రకం.

రచనల్లో మరొక రకంవుంది. భాషలో ఎక్కువ కృషి చేసి భావాలకంటే భాషకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంటారు, కాని భాషకోసం ఈ రోజుల్లో ఎవరు పుస్తకాలు చదువుతారు? భావదారిద్ర్యాన్ని భాషాపాండిత్యంతో కప్పిపుస్తే ప్రజలు ఆ పుస్తకాలు ఎందుకు చదువుతారు? ఒకవేళ చదివినా ఎలా ఆనందిస్తారు? కనక ఈరకంకూడా "వాళ్ళకు నచ్చలేదు" అనే

తృప్తిపడాల్సివొస్తుంది. "మేం పండితులం. భాషలో బాగా కృషిచేశాం. వ్యాకరణం శుద్ధంగా చదువుకున్నాం. అయినా ఈ మూర్ఖులు మమ్మల్ని ఆదరించటంలేదు," అనుకోవడం వల్ల ప్రాదికడే దేమీలేదు.

నేను రాసినపుస్తకం చదవమని ఒక పెద్దమనిషి కిచ్చాను ఆతను తీసుకువెళ్ళి, రాత్రి చదివి, తెల్లవారగట్ల భద్రంగా తీసుకొచ్చి ఇచ్చాడు.

"ఎలావుంది?" అని అడిగాను.

"సాభిప్రాయంగా అది రాశారే! అక్కడ కరారావిడికాదు వుండవలసింది. వట్రసుడి వుండాలి," అన్నాడు

అంతే! ఇంతకు తప్పితే అతడు పుస్తకాన్ని గురించి ఏమీ చెప్పలేదు. ఈ అభిప్రాయం తప్పనిగానీ, ఈ అభిప్రాయంరైటని గానీ, ఈ అభిప్రాయం బాగుందని గానీ, ఈ అభిప్రాయంబాగా లేదని గానీ, ఏమీ చెప్పలేదు. అసలు ఆ పుస్తకంలో నేను వెలిబుచ్చిన అభిప్రాయాలజోలికి అతడు వెళ్ళేవుండడు "ఆ కరా రావిడి తీసి వట్రసుడిపెట్టండి" అని చెప్పి నా పుస్తకం నాకిచ్చి తనదారిని తాను వెళ్ళాడు.

ఇతడు తర్వాత ఒకపుస్తకం రాశాడు. ఎక్కడ కరారావిడి పెట్టాలో అక్కడ కరారావిడి పెట్టాడు. ఎక్కడ వట్రసుడి ఉంచాలో అక్కడ వట్రసుడి ఉంచాడు. ఎక్కడ బండిరా పెట్టాలో అక్కడ బండిరా పెట్టాడు.

కాని అంతే!

భాష, భావాలను వెలిబుచ్చటానికి ఉపయోగపడేసాధనం మాత్రమే అనే సంగతి మరచిపోయాడు, బండిరాళ్లలో కరారా

ళ్లలో పని అసలు భావాలను గురించి ఆలోచించటానికే తీరిక
ంసీ ఉండదా? ఇలా రాసిన పుస్తకాలు ప్రజలకు నచ్చకుంటే
ఎలా నచ్చుతాయ్? మనం ఎన్ని గ్రంథాలు చదువుకుంటే వాళ్ళ
కేం? ఎన్ని శాస్త్రాలు మథనం చేస్తే వాళ్ళకేం?

రచయితలకూ, ప్రజలకూ కలవకపోవటంవల్ల వచ్చే బాధ
ను కొంతమంది రచయితలు చూస్తారు. చూసి యీ బాధలు
తప్పించుకోటానికి సులభసూత్రం ఒకటి కనిపెడతారు. అదేమి
టంటే ప్రజల్లో వ్యాపించివున్న మూఢాచారాలను తేలిక
భాషలో వాళ్లకు అర్థమయ్యేటట్టు రాయటం. ఈ రకం రచయిత
లకు కావలసినంత ప్రజాదరణ వుంటుంది. "శాస్త్రే, ఆయన
రాసినట్టు రాయాలి" అంటుంది ప్రజ. కాని వీళ్లవల్ల మిగిలిన
వాళ్ళందరికంటే ప్రజలకు ఎక్కువ అపకారం కలుగుతోంది.
వాళ్లని ఇంకా అజ్ఞానదశకు తీసుకుపోవటానికే వీళ్లు ఉపయోగ
పడతారు. 'వాళ్లకు నచ్చలేదు—' అనే చింత వీళ్ళకు లేదు.
ప్రజలు వీళ్ళపక్షమే వుంటారు. కాని, ప్రజల శ్రేయస్సు
కోరేవాళ్ళు మాత్రం వీళ్లకు ప్రజాదరణ లేకుండా చెయ్యాలి.
ప్రజల ఆదరం ఒక్కటే ఉత్తమగ్రంథ లక్షణం కాదు. ప్రజల
శ్రేయస్సుకు సహాయపడే భావాలు వెలిబుచ్చుతా, వాళ్ళ
ఆదరాభిమానాన్ని సంపాదించాలి.

ఇలా రాసేరచయితలు మరొకటి గమనించాల్సి వొస్తుంది.
మొదట్లో 'వాళ్లకు నచ్చలేదు' అని వెనకబడిపోగూడదు. వాళ్ళు
అలవాటుపడ్డ సంస్కారానికి భిన్నంగా రాయటంవల్ల ప్రజలు
కొద్దికాలం నిరాదరణచూపిస్తారు. కాని—కొద్దికాలంమాత్రమే.
రోజులు గడిచినకొద్దీ ఈ రచయితలకే పలుకుబడి ఎక్కువ

అవుతుంది. 'వాళ్లకు నచ్చలేదు' అని విచారపడవలసిన అవసరం ఉండదు.

వాళ్ళకు తప్పకుండా నచ్చితీరాలి. ఎందుకంటే రాసేదివాళ్ల కోసమేగా! రచయితలు సరిగ్గా రాస్తే నచ్చకపోవటం అనేది ఉండదు. నచ్చలేదని నిందించటం కాక, విచారించటం కాని మంచి లక్షణం కాదు,

కనక ప్రజాసామాన్యానికి శ్రేయస్సు కూర్చే భావాలను, వాళ్ళకు నచ్చేటట్లు చెప్పటమే ఉత్తమ రచన అవుతుంది.

[రచనల్లోని భావాలు 'నచ్చలేదు' అనే
నా రేడియో ప్రసంగంలోని.]

## ఆత్మవిశ్వాసం

ఈమధ్య భాషాభిమానుల్లో చాలా అహంకారం బలిసినట్లు కనిపిస్తుంది. దీనికి కారణం ఏమిటా అని నేను చాలా ఆలోచించాను. నాకు ఒక్కటే తట్టింది. చాలామంది పెద్దవాళ్ళు ఆత్మవిశ్వాసం మనిషికి అవసరమని చెప్పారు. ఈ అభిప్రాయమే భాషాభిమానుల్లో అహంకారాన్ని పెంచిందని నా అనుమానం.

కాని ఈ భాషాభిమానులు ఒకసంగతి మాత్రం మరచిపోకూడదు. ఆత్మవిశ్వాసం రెండు రకాలుగా కలుగుతుంది. ఒకటి జ్ఞానంవల్లా; రెండు అజ్ఞానంవల్లా.

సర్వమూ తెలుసుకొని, అందరికంటే 'నాకు ఎక్కువ తెలుసని ఒకరనుకుంటారు. బాహ్యప్రపంచమే తెలియకపోవటం వల్ల అందరికంటే నాకు ఎక్కువ తెలుసని ఒకరనుకుంటారు.

మన భాషాభిమానులు ఈ రెండో రకానికి చెందుతారేమోనని నా భయం.

ఈ మాట అన్నానని కోప్పడవద్దు. మార్చుకోవటం మంచిది. లేకపోతే ఆత్మవిశ్వాసాన్ని పొందేటంత జ్ఞానాన్ని సంపాదించటం మంచిది.

## ఒక చైతన్యం

భావాలు సంఘ పరిస్థితుల్నిబట్టి కలుగుతై. మొదట్లో ప్రజా సామాన్యం నూతనభావాలను స్వీకరించక ఎదురుతిరుగుతుంది. ఆ భావాలను వెలిబుచ్చినవాణ్ణి "రెటమతసిద్ధాంతి" అనీ "వికట కవి" అనీ, యింకా అనేక విధాల హింసిస్తుంది. కాని క్రమేపీ ఈనూతన భావాలు ప్రచారంలోకి వస్తయ్. ప్రజాసామాన్యం వాటిని ఆదరిస్తుంది. మరికొన్నాళ్లకి ఈ భావలే సాంప్రదాయాలుగా తయారవుతై. మొదట్లో సంఘానికి మేలుచేకూర్చటానికి అంకురించిన ఈభావాలు, సాంప్రదాయాలుగా మారింతరువాత చిట్టింకట్టే సంఘాభివృద్ధికీ, మానవశ్రేయస్సుకీ, ఆటంకాలవుతవి. అప్పుడు విప్లవదృక్పథం కలిగినకవులూ రాజకీయవేత్తలూ ఆసాంప్రదాయాల్ని బద్దలకొట్టి, సంఘాన్ని ఒక మెట్టు ముందుకు తీసుకుపోవటానికి పూనుకుంటారు. అలా చెయ్యక ఇవి మన సాంప్రదాయాలనే మోజుతో వాటినే పొగుడుతూ కూర్చునే వారుమాత్రం విద్రోహులుగా, నాశనకారులుగా పరిగణించబడతారు.

సంఘాన్ని ముందుకు వెళ్లనివ్వకుండా నిరోధిస్తూ, సమాజాభివృద్ధిని కలుషితపరచి, సంఘాన్ని కుళ్ళబెట్టటానికి పూనుకున్న ఈ సాంప్రదాయాలను బద్దలకొట్టడమే రామస్వామిచౌదరిగారు చేసిన పని.

ఆనాటి సంఘంలో అగ్రజాతులు మిగిలిన జాతులను బానిస జాతుల్నిగా తయారుచేసి, అజ్ఞానాన్ని పెంపొందించుకోవటమే వాటికి ధర్మంగా నిర్ణయించిపెట్టి, తన స్వలాభంకోసం పీడిం

చటం మొదలుపెట్టింది. భిన్న కులాలు, భిన్న ధర్మాలు, భిన్న ఆచారాలు సృష్టించి పెత్తనం చేస్తూ వుంది. చౌదరిగారు అల్ప సంఖ్యాకమైన ఈ వర్గం యొక్క నిరంకుశత్వానికి ఎదురుతిరిగి, ఈ నిరంకుశత్వంలో పడి నలిగిపోతూ ప్రజాబాహుళ్యానికి దాస్యవిమోచనం చెయ్యాటానికి కంకణంకట్టుకున్నారు. ప్రజా బాహుళ్యం ఈదాస్యాన్ని ఎందుకు సహిస్తూవుంది? అగ్రజాతి తన అధికారాన్ని ఎలా నిలబెట్టుకోగలుగుతూ వుంది? ప్రజా బాహుళ్యం తన అస్వతంత్రతని ఎందుకుగ్రహించుకోలేకపోతూ వుంది? అగ్రజాతి ఏ యుక్తులవల్ల పెత్తనం చెయ్యగలుగుతూ వుంది?

ఒక వర్గం అధికారంలోకివచ్చి, మిగిలినవర్గాల్ని పీడించటం మన సంఘంయొక్క ప్రత్యేకత కాదు. దీన్నిఆధ్యాత్మిక నాగరికత అని పొగుడుకో నక్కరలేదు. ప్రపంచ చరిత్రనుచూస్తే ప్రతి దేశం ఈఅవస్థను ఎప్పుడో ఒకప్పుడు అనుభవించేవుంది. కాని ఆయా దేశాలు పైవర్గంమీద జయప్రదంగా విప్లవాలు చేసి, బానిసత్వాన్ని పోగొట్టుకో కలిగినయ్; మనం మాత్రం అందులోనే పడి కొట్టుకుంటున్నాం—! ఇంతే భేదం. అల్ప సంఖ్యాకులు సవిశేషంగా, ఏయుక్తులతో, ఏ సాధనాలతో ప్రజా బాహుళ్యాన్ని దాస్యంలో వుంచి తాము పెత్తనం చెయ్యగలుగుతున్నారో విచారిద్దాం. దీనికి మూడు పద్ధతులున్నాయి—

1. తమ అధికారాన్ని నిలబెట్టే గ్రంధాలను ఆదర్శ గ్రంథాలుగా, పూజ్య గ్రంథాలుగా ప్రజలను నమ్మించటం.

2. స్వర్గం నరకం అనే వాటిని సృష్టించి, అప్పటి సాంప్రదాయాలకు విరుద్ధంగా నడిచేవారు నరకంలో యమయాతన

అనుభవిస్తారని భయపెట్టీ, అప్పటి సాంప్రదాయాలకు కట్టుబడి బానిసత్వంలో జీవితం వెళ్లబోసుకున్న వాళ్లకి స్వర్గ సుఖాలు చేకూరతాయని చెప్పి ప్రేరించీ, మోసం చెయ్యటం.

౫. దేవుణ్ని సృష్టించి, మిగిలిన వర్గాలకు జరిగే అన్యాయా లనూ అక్రమాలనూ, కర్మ సిద్ధాంతానికి ముడిపెట్టి: మతంఅనే మత్తుమందు చల్లటం.

కనక అగ్రజాతియొక్క. అధికారాన్ని కాపాడుకోవాలంటే, అది ఉపయోగిస్తున్న సాధనాలను నిర్వీర్యం చెయ్యాలి. చౌదరి గారు ఇది గ్రహించి, ముందు ఈ సాధనాలను ఏ విధంగా నిరుప యోగం చేశారో వివరిస్తాను——

భారత భాగవత రామాయణాలూ, ధర్మ శాస్త్రాలూ, పూజ్యగ్రంథాలు కావని, ఒక వర్గం తన అధికారాన్ని సుస్థిరం చేసుకోటానికీ, మిగిలిన వర్గాల్ని దాస్యంలో వుంచటానికీ, వ్రాసిన గ్రంథా లని ప్రచారంచేశారు. రాముడికంటే రావ ణుడు గొప్పవాడన్నారు. పాండవులకంటే కౌరవులే నీతిపరు లన్నారు. ప్రహ్లాదుణ్ణి పితృహంతకుడిగా వర్ణించారు. సుగ్రీవ విభీషణుల్ని భాతృహంతకులుగా వర్ణించారు. ఈసందర్భంలో శంబుకవధ లోని ఈదిగువ సంభాషణ ముఖ్యంగా గమనించ దగ్గది.

శంబుకుడు

కుమారా! అంగదా! నీ సంభాషణమున కీర్తుపగారి మత శాస్త్రము లనుచుంటివి; ఏవి శాస్త్రములని నీ ఆశయము ?

అంగదుడు

ఆర్యులు చెప్పిన స్మృతులని.

శంబుకుడు

అవి మన పెద్దలవా ?

అంగదుడు

ఏను ఋష్యాశ్రమమునందుండుట, మన పెద్దలు కారో తెలియకుంటిని.

శంబుకుడు

తెలియ జెప్పెద వినుము.

ఋషులలో మరెవ్వరో పలువురు కచ్చుటలో గలిగూడి తాము క
ల్పనమతి పక్షపాతముగ లక్షల గ్రంథము వ్రాయగా నటి
ట్టి పుస్తకము పవిత్రము పెట్టుక పూజ సేయవలెవ్వ నేర్తుమే!
ఋషులకు మాత్రము పుట్టుచుండే ఋజుమార్గము వాలినంతనా ?

ఇట్లు వ్రాయబడిన శాస్త్రములు మన శాస్త్రము లెట్లగును ? మనకుగా వ్రాసిరా? మన అభిప్రాయములు గొనిరా? కానినాడు మన మేల వానిచే బంధింప బడవలయును ?

ఇప్పుడిప్పుడూ కొందరు, చౌదరిగారు ఈ గ్రంథాల మీద వ్రాసిన విమర్శలుచదివి ఈవిధంగా ప్రశ్నిస్తున్నారు ... ... 'రాముడు మంచివాడు కాకపోతే పోయాడు, రావణుడు మంచి వా డెలా అవుతాడు?' 'హిరణ్యకశిపుణ్ణి విష్ణువు నరసింహ రూపంలో చంపకపోతే పోయాడు, స్తంభంలో సింహాన్ని పెచ్చి ఎలా బిగించారు?' 'పాండవులు ధర్మాత్ములు కాకపోతే పో యారు, కౌరవులెలా గొప్పవారయ్యారు?' 'పన్నెండు సంవ త్సరాలు దాటితే ఈరోజుల్లో లిమిటేషన్ పడుతుంది గాని, ఆరోజుల్లో పాండవులకు రాజ్యార్హత లేకుండా పోవటానికి ఇది కారణం ఎల్లాఅవుతుంది?'

ఇలా ప్రశ్నించేవారికి అసలు చౌదరిగారి పుస్తకాల్లోని ఫిలాసఫీయే అర్థం కాలేదేమో నని నాభయం. ఎందుకంటే చౌదరిగారు ఈపుస్తకాలు రాయటానికి కారణం యేమిటి ?

రావణుడు గొప్పవా డని నమ్మమనా? కాదు. హిరణ్యకశ్య
పాదులు గొప్పవా రని నమ్మమనా? కాదు. దుర్యోధనాదులే
రాజ్యార్హులనీ పాండవులకు రాజ్యంలో హక్కు లేదనా?
కాదు. మరిం కేమిటి? పూజ్యగ్రంథా లనే వంకతో ప్రజా
సామాన్యాన్ని బానిసత్వంలో వుంచటానికి సహాయపడే గ్రంథా
లమీద పూజ్యభావం లేకుండా చెయ్యటమే వారి రచనల
ఆదర్శం—'పూజ్యగ్రంథా లయిన పౌరాణ భాగవత రామాయ
ణాల్లోని విషయాలెంతసత్యమో తన గ్రంథాల్లోని విషయాలూ
అంతే సత్యం.' అనుకుంటే ఆయనఆదర్శం నెరవేరినట్లే!' కవులు
కూర్చుని ఏదైనా వ్రాస్తారు. అవన్నీ గుడ్డిగా నమ్ముతూ
కూర్చుంటే ఎట్లా?' అని ప్రజాసామాన్యం అనుకుంటే ఆయన
కృతకృత్యు లైనట్లే! కనక ఆయన రచనల విలువ తెలుసు
కునేపద్ధతి ఆయన చెప్పిన ప్రతి ఆర్గ్యుమెంటూ తప్పా ఒప్పా, అని
ఆలోచించటం కాదు—ఆయన ఈవిధంగా రాయటంవల్ల పూర్వ
గ్రంథాల మీద విలువ తగ్గిందా, లేదా? అని ప్రశ్నించుకోవటం.
అలా జరిగితే ఆయన సారస్వతసేవా, కృషీ, ఫలించినట్లే!

శంబూకవధలో శంబుకుడు ఇలా అంటాడు: 'కవి లేఖినికి విశ్వా
మిత్ర సృష్టి జేయు శక్తి గలదు.' కుప్పుస్వామి శతకంలో ఇదే అభి
ప్రాయం ఈక్రింది పద్యరూపకంగా వెలిబుచ్చారు.

> గనుకగుణంబున బుట్టదే రాముకన్న
> గొప్పవాడు? వారల కవి గొప్పవాడైన
> వింటిమే! 'సత్య[illegible] టూకువితని చేత
> గొప్పవాడయ్యె రాముడు కుప్పుస్వామి

అందుకనే తనకు సూతమహర్షి పురాణాలు చెప్పినట్లూ,

పాదలేపనము పట్టించ నతఁడు వేగ
మింటికెగసినాఁడు మంచుకొండ
తెల్లవారలేదు తిరిగినాఁడు మాయూరి
నాఁడు వృక్షము మీఁది చెట్టు క్రింద

అని వ్రాశారు. మీకు సూతమహర్షి ఎలా పురాణాలు చెప్పాడు? పాదలేపనం రాసుకొని ఎలా మింటికి ఎగిరారు? అని ప్రశ్నిస్తే, 'పూర్వగ్రంథాల్లోని విషయాలు నమ్మితే, ఇదీ నమ్ము! అవి నమ్మకపోతే ఇదీ నమ్మకు!' అని జవాబు చెపుతారు.

ఇక పై వర్గం అధికారానికీ, క్రింది వర్గాల దాస్యానికీ, కారణభూతాలైన స్వర్గనరకాలను ఏ విధంగా విమర్శించి వాటినుంచి ప్రజల నే విధంగా రక్షించారో విచారిద్దాం.

మన టిబెట్టే, త్రివిష్టపం— స్వర్గం. ఈ దేశాన్ని సందర్శించటానికి వెళ్ళిన సూతమహర్షి అక్కడి నాగరికతను తిలకించి నివ్వెరపోయి ఇలా అనుకున్నాడు:

మిన్నేటి గట్టుపై మిడుకుచు నుండు నా
కొంటె కన్నియ లేత గొట్టుచోటు
నందనోద్యానంబు నందుండు నందు నా
గోవాండ్ర గమిగుంపు గూడుచోటు
పొన్నారి పొదరిండ్ల బన్నుండు నందు నా
కాముకీ కాముకుల్ గలియుచోటు
కొండ నెత్తము లెక్కి కూర్చుండు నందు నా
చారవతో బ్రోయాంత్రము తిరుగుచోటు
కాన మిటఁ జాటు చోటొక్క జానెడైన
మానిజన వాసయోగ్యమా దాని నకట
బాగు! శివ!! శివా!!! యిది వట్టి భోగభూమి
యుండరా దిందు మావంటి యోగులకును.

ఇండ్లు మున్నవి గాని పెండ్లిండ్లు లేవు
బిడ్డ లున్నారు కాని యిల్లాండ్రు లేరు
హాహా! శివ!! శివా!!! యిదివట్టి భోగభూమి
చూడరా యిందు మావంటి యోగులకును.

ఈ నాగరికత పర్యవసానం ఏమిటయ్యా అంటే,

కల్లు నిచ్చెడి చెట్లకు గల్లు గౌర
వంబు పెద్దవానికిని లేదు, వజ్రముల
గద్దెకట్టెడి భోగంపు గరితకున్న
పలుకుబడి కానరా దెట్టివారి కింక.

ఇక దేశాన్ని ఏలే దేవేంద్రుడు ఎటువంటివాడు? అతనికి వెయ్యి కన్నులున్న వని ప్రతీతి. కాని సూతమహర్షి ఏమంటున్నాడో వినండి.

వినుము ప్రాచీన బ్రహ్మర్షి వేయిగనులు
కలవని పురాణములు పల్కు గంత మెత్తి
వేయికన్నులు నాకు గన్పింప లేదు
పొడలు మాత్రము గన్పించె నొడలినిండ.

మహేంద్రుడికి ఒడలినిండా పొడలు ఎందుకు వచ్చాయో వేరే చెప్పనక్కర్లేదు. ఇటువంటివాని ఏలుబడిలోవున్న స్వర్గం ఏవిధంగా వుంటుంది?

శ్రోత్రియవరుడైన సోమయాజులు వాని
కొంప తల్పులు చేత గొట్టుచుండ
గ్రంథములోప బెనగి కూలికి వల్లు
కానివాడు ... పల్పుచుండ
యజ్ఞయాగాల నాచరించిన పెద్ద
ఘన పండితుల ఇండ్లు దోయుచుండ
నిద్రించి తపములో నెగ్గిన జటిలుండు
బాజుగు బోటుల పొంతనుండ

నాకి చెలియక జతగాక తానుచుండ
గంతె తెలు చలిక నెన్న గన్నొల్లు చుండు
నగపు కొంచెద్దె పెండవన్నె నవ్వు గుండు
వల్లకల్లోల పైగుండె నాకపురము

ఎవరు కాదనగలరు?

ఈవిధంగా తెను తిరగటం తప్ప స్వర్గంలో మరేమీ (ఒక పని తప్ప) పని వుండదు. ఏ సమస్యలూ వుండవు. సోమరితనం వల్ల చివికి జీర్ణించిపోయిన నాగరికత, అలవాట్లు అయిన స్వర్గాన్ని గురించి ఖూని నాటకంలో యిలా వ్రాశారు

వేనుడు

శునశ్శేపా, యింతవరకూ చెప్పనైతివి. ఉత్తమలోకములనగా నేమి? స్వైరవిహారములు పానము, వృద్ధ వేశ్యావలి తోజన తాపాంగవీక్షణములే నా? ...ఇవియే యైనచో ఈభూలోకంబున దొరకవా? విచ్చలవిడితిరుగరాదా? ముసలి పడుపుగత్తెల కౌగిళ్ళ, కులికి కులికి లాలాచవంబును జవిచూడ రాదా......?

ఇక ఈ స్వర్గం ఎవ్వర్ని ఆకర్షిస్తుంది? ఈ స్వర్గం కావాలని ఎవ్వరు ఆపేక్షపడతారు.? ఈ స్వర్గంకోసం ఎవ్వరు భౌతిక సుఖాలను వదులుకొని బానిసత్వానికి లోబడతారు? ఇకనరకం ఎవ్వర్ని బెదిరిస్తుంది? ఈనరకానికి భయపడి ఎవ్వరు అగ్రజాతి నాగరికతకు లోబడి, దాస్యంచేస్తారు ?

తరువాత అగ్రజాతి అధికారానికి మూలో సాధన మైన దేవుని యొక్క, మతం యొక్క విలువను తగ్గించటానికి చౌదరిగారు చేసిన ప్రయత్నాన్ని విచారిద్దాం.

వేనుడు

ఎవ్వడు నాకీ నరకలోకము నిచ్చునది ?

శునశ్శేపుడు

భగవంతుడు.

వేనుడు

నీవు చెప్పిన చొప్పున భగవంతునకు నీ ప్రపంచమున నిత్యము జరుగు చున్న కార్యక్రమమునందు చేతనమే యున్నయెడల నిన్ని ఘాతకకృత్యము లేల జరుగుచుండవలెను? వివరించలేవా?

శానశ్రేష్ఠుడు

మానవుడు కర్మప్రేరితుడై చేయుచున్న కార్యముల నెవ్వడు మాన్ప గలడు?

వేనుడు

అయినచో భగవంతుడు నిష్ప్రయోజకుండా?

గాత్రముడు

నిష్ప్రయోజకుం డెట్లగును? అతడు సర్వకర్మలకు సాక్షి.

వేనుడు

కూటసాక్షియా? ఎందుల కీసాక్షిత్వము? తన కన్నెదుట జరుగుచున్న క్రూర కర్మముల మాన్ప నేరక సాక్షియగుచున్నాడా? ఏమి చిత్రము? ఈ సాక్ష్యము యెవ్వని యెదుట ఉపయోగపడును? ఎవ్వనికి ప్రయోజనకారి యగును? విచారణకర్త ఎవ్వరు?......లోకమునకన్నప్పి మీరు వ్యవసాయమునకు తోడ్పడ భగవంతుని నొకని సృజించి, లేనిపోని సర్వశక్తులు వానికంటగట్టి, జగము నుఱ్ఱూతలూగింప యత్నించుచుంటిరి.

ఈ సందర్భంలో సూతపురాణంలోని యీ పద్యం జ్ఞప్తికి వస్తూవుంది. మొదటి ఆశ్వాసంలో—

విభుఁ డొకఁడు చేయు నంట పై పెత్తనంబు
కర్మ మొకఁడు సంసారచక్రంబు ద్రిప్పు
నంట !! ద్వంద్వ ప్రభుత్వ మిం దమరలేదె !
ఎంత కాలంబు సాగునో ఇట్టి చిట్ట !!

దైవభక్తిని గురించి కుప్పుస్వామి శతకంలో ఈ విధంగా వ్రాశారు:—

గుడికి తరుచు పోయి గొణుఁగు చుండెడివాఁడు

నదియై నానిం బట్టి యట్టిట్టు పీడించ
నడికి పోవ నతడు కుప్పుస్వామి.
పాతికుల చేత చెప్పడు గీత యుండు
మొగమునపై వింత వింతగ బొట్టు లుండ
కన్నె కివియె మనసాక్షి నన్నగిలిన
చుప్పుడా జనాళి కెంగుచు కుప్పుస్వామి.

ఈ విధంగా రాసి, చివ్వరికి దేవున్ని గురించి ఈ విధంగా ముగించారు.

మానవుడు మృగదశలో నున్నప్పుడే కొండగానో, ఏయేరుగానో, వెలిసిన దేవుడు, మానవ జ్ఞానము పరిణామము బొందుచున్న కొలది, భగవంతుడు కొండరూపమును వదలి, మృగమై, మృగమునుండి మనుష్యుడై, మనుష్య దశ నుండి యదృశ్యరూపుడై, నిరాకారుడై, నిరంజనుడై, నిర్వికల్పుడయ్యెను. ఇక తరువాతి దశ యేమి? శూన్యత్వము అనగా నాస్తికత్వము...

ఇలా అగ్రజాతి అధికార సాధనాలను విమర్శించి హేతువాదానికి స్థానమిచ్చి, బానిస ప్రజలకు చైతన్యాన్ని కలిగించి మూఢవిశ్వాసాలను పోగొట్టి, అగ్రజాతి నిరంకుశత్వం యొక్క పునాదులను ఊడగొట్టారు.

ఇప్పటి కవులలో లేని గొప్ప విశేషం మరొక్కటి చౌదరి గారిలో వుంది. అదేమిటంటే సాధారణంగా మన కవులు భావాలను వెలిబుచ్చటం తప్ప వాటిని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించరు. పుస్తకాలు వ్రాయటం తమ పనీ, కార్యాచరణకు పూనుకోటం మరొకరి పనీ అనుకుంటారు. ప్రజా సామాన్యంతో సంబంధం పెట్టుకోటానికే ఇష్టపడరు. ప్రజా సామాన్యం నాగరికతను చూసే ఏవగించుకుంటారు. ఇక వారితో కలసి మెలిసి ఎలా తిరగ గలరు?

చౌదరిగారు మాత్రం అలా కాదు. ఆయన కార్యవాది. తమ

అభిప్రాయాలను ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించాడు.
ఆచరణయోగ్యములు కాని ఏ వాలవల్లకాని, కార్యసాధనం
కాల్పనిక అభిప్రాయాలవల్ల కాదే. సంఘానికి ఏమీ లాభం లేదని
ఆయనకు తెలుసు. అందుకని రాజకీయంగా జస్టిస్ పార్టీలో ప-
కృషిచేశారు.

మన సంఘంలో, 'ఆయన జస్టిస్ పార్టీలో చేరకుండా వుం-
డేనా!' అనే అభిమానులు చాలామంది ఉన్నారు. ఇది పొర-
పాటు. సిద్ధాంతరీత్యా మొదటివర్గంమీదకు మిగిలిన వర్గాల్ని
విప్లవం చేయించడానికి పూనుకున్న వ్యక్తిని, క్రమంలో మూడో
వర్గాన్ని పై రెండు వర్గాలమీదకూ విప్లవం చేయించటానికి
ఎందుకు పూనుకోడు! అని ప్రశ్నించవచ్చును. అలా పూనుకో
వాలని వాంఛించలేదని కేవలం పొరపాటు. విప్లవ కారుడు
పరిస్థితులను అనుకూలంగా విప్లవం లేవదియ్యాలిగాని ఊహా-
గానం చెయ్యకూడదు. విప్లవాలకు దగ్గరదారి లేదనే సత్యాన్ని
మనం మరవరాదు.

ఈ విషయమే విపులంగా చెబుతాను.—

మన సంఘం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రవర్గా
లుగా విభజించబడింది. మొదట్లో బ్రాహ్మణవర్గం అధికారంలో
వున్నప్పుడు ఆ వర్గంమీదకు మిగిలిన వర్గాలన్నీ కలిసి విప్లవం
చేస్తాయి. కాని క్షత్రియవర్గం అధికారంలోకి వస్తుంది. అప్పుడు
క్షత్రియవర్గంమీదకు మిగిలిన రెండువర్గాలు విప్లవం చేస్తవి.
కాని వైశ్య (Capitalist) వర్గం అధికారంలోకి వస్తుంది.
అప్పుడు మిగిలిన శూద్రవర్గం పై వర్గాలమీదకు విప్లవంచేసి
అధికారాన్ని వశంచేసుకుంటుంది.

కనుక మొదటి విప్లవాన్ని లేవదీసే కవినిగాని, రాజకీయ వేత్తనిగాని, రెండో విప్లవం లేవదీయ లేదనిగాని, రెండో విప్లవా నికి పూనుకున్న రాజకీయసంస్థలో జేర లేదనిగానీ విమర్శించటం చారిత్రిక జ్ఞానం లేకపోవటం. మొదటి విప్లవం జరక్కుండా రెండో విప్లవం. రెండో విప్లవం జరక్కుండా మూడో విప్లవం జరుగదుగనుక, వర్గసంబంధాలనుబట్టి మూడో విప్లవంవల్లలాభం పొందే వర్గంకూడా ప్రథమంలో మొదటివిప్లవానికే సహాయం చేయవలసి వస్తుంది. ఈ దృష్టితో చూస్తే జస్టిస్ పార్టీఒకప్పుడు విప్లవసంస్థే! జస్టిసుపార్టీ ఒక విప్లవం నడపబట్టే యిప్పుడు మరొక విప్లవం చేయడానికి పరిస్థితులు అనుకూలించాయని కూడా మనం మరచిపోగూడదు. చారిత్రకదృష్టిగలిగిన ఎవ్వరూ యిది కాదనలేరు.

రష్యాలో, సోషలిస్టు ఉద్యమం రావటానికి ముందు నిహి లిస్టు ఉద్యమంపనిచేసింది. ప్రజలలోవున్న మూఢవిశ్వాసాలను పోగొట్టటమే దీని ఆదర్శం. ఈవిధంగా ముందే దారిని శుభ్ర పరిచే ప్రయత్నం జరగటంవల్ల, తరువాత వచ్చిన సోషలిస్టు ఉద్యమంపని తేలికయింది.

ఆంధ్ర దేశంలో చౌదరిగారు నిహిలిస్టులు. దేవుడు లేడనీ, మతం కుట్రలు కోసుకోటానికే వుపయోగపడుతుందనీ, చెప్పి హేతువాదాన్ని ప్రచారం చేసిపెట్టి సోషలిస్టు ఉద్యమానికి పునాది వేశారు.

చౌదరిగారు, కవిత్వంలో సంస్కృతపదాలకంటే, జాతీయ పదాలనే యెక్కువగా వాడాలని ప్రచారం చేస్తున్నారు. ఇలాంటి ఉద్యమమే వొకప్పుడు 'ప్యూరిస్టు మూవ్‌మెంట్' అనే

పేరుతో ఇంగ్లాండులో పుట్టింది. అప్పుడు ఇంగ్లీషుభాష, లేటిన్ భాష 'యిన్ఫ్లుయన్స్'లో వుండటంవల్ల, కొందరు ఇంగ్లీషు భాషలోనించి లేటిన్ పదాలు ఏరి వెయ్యాలనే పట్టుదలతో యీ వుద్యమాన్ని లేవదీశారు. లేటిన్ భాషమీద ఏహ్య భావం కలగటానికి ఒక కారణం యిది. మతకర్తలు, లేటిన్ భాషలో దేవుడు దేవరహస్యాలు వ్రాసిపెట్టాడని, లేటిన్‌లో వ్రాసిన గ్రంథాలలో దేవుడు తమకు స్వర్గద్వారపు తాళపు చెవులను యిచ్చివెళ్ళాడనీ, దేవునిచే నిర్దేశింపబడిన తాము తప్ప యితరులు ఆ గ్రంథాలను చదవకూడదనీ చెప్పి కొన్నాళ్లు ప్రజాసామాన్యాన్ని మోసం చేశారు. కాని మోసం యెన్నాళ్లు దాగుతుంది? ప్రజ తిరుగుబడింది. 'మేం చదవకూడని భాష మాకెందుకు? నమ్మల్ని దాస్యంలో వుంచటానికి వుపయోగింపబడిన భాష మాకెందుకు? ప్రజాసామాన్యానికి అందుబాటులో లేని యీభాష మాకెందుకు? మాకేం భాష లేదా? మాభాషలో మేం వ్రాసుకోలేమా? మా భాషలో మేం చదువుకోలేమా? మా భాషలోనే వ్రాస్తాం! సాహిత్యానికి సుచ్చుకొనేటట్టు వ్రాస్తాం! శరీరం పులకరించేటట్టు వ్రాస్తాం! శౌర్యాగ్ని ప్రజ్వరిల్లేటట్టు వ్రాస్తాం. అసలు వ్రాయటానికి మా భాషే తగింది. అని పట్టుపట్టారు.

చౌదరిగారి ప్రకృతికూడా యీ విధంగానే తయారైవుండదని నా విశ్వాసం. అగ్రజాతి, 'సంస్కృతం, దేవభాషా, అది శూద్రులు చదవకూడదూ' అని శాసించడంవల్ల 'అసలు పరభాష మాకెందుకూ? ప్రజలహృదయాల్లోనించి వచ్చిన సజీవమైన మా భాషే మేం వ్రాసుకుంటాం,' అనే పట్టుదలతో

యీప్రాధాన్యాన్ని లేవనెత్తారు.

విప్లవం ప్రజలతో పని. ప్రజల భావాలు మారందే విప్లవం రాదు. అందుకనే ప్రతి విప్లవకారుడూ ప్రజలకు అర్థమయ్యే భాషలో తన భావాలను చెప్పుకోవటం ముఖ్యావసరం. అందుకనే బుద్ధుడు సంస్కృతంలో గ్రంథాలు రాయటం మానివేసి పాళీ భాషలో రాయించాడు. అందుకనే చౌదరిగారు 'దేశీయత్వం కావాలి' అంటారు. జాతీయాలు వుపయోగించటానికి ఉవ్విళ్లూరుతారు. సంస్కృత వాసనలు మనకు పనికిరావని ప్రచారం చేస్తారు.

ఇక్కడ మరొక విషయం చెప్పాలి. అగ్రజాతివిగాక మిగిలిన వర్గాలు విప్లవం చేసేస్థితికివచ్చి యీదృష్టితో రచనలు బయలుదేరేటప్పటికి, అగ్రజాతి యీరచనలను 'శూద్రభాష' అని యీసడించటం జరుగుతుంది. రామస్వామిగారు మొట్టమొదట వ్రాసిన కురుక్షేత్ర సంగ్రామంలో కురుపాండవుల పోరాటాన్ని తెలుసుకోవాలని విచారపడి సంజయుడు 'ఆముదెద్దులు రెండూ పోట్లాడుకుంటే మధ్యనున్న లేగలకాళ్ళు నలుగుతాయి' తన స్థితి వ్రాదని చెప్పుకొన్నట్లు వ్రాశారు. దీనిని ఒకవిమర్శకుడు 'శూద్రప్రకటనగనుక శూద్రపోకలు వచ్చా'యని విమర్శించాడు.

అగ్రజాతి సంస్కారంగల విమర్శకులూ, చారిత్రిక జ్ఞానం లేని విమర్శకులూ స్వార్థదృష్టితో తమకు విరుద్ధమైన తత్వాన్ని కాపాడుకోటానికి గింజుకునే రచయితలుగా పైవిధంగా విమర్శించటంలో ఆశ్చర్యంలేదు. దీన్నిబట్టి చూడటంగా, లేగలగా మొదలైనవాటిని కవులు తనురచనల్లోకి తీసుకురాకూడదనీ, మబ్బులూ, మలయమారుతం, వెన్నెలా, చంద్రుడూ, అస్తమించబోయే సూర్యుడూ

ముఖ్యమైన పనులకే కవిత్వాన్ని దింపాలని వీరి ఉద్దేశం. జి. వి. కృష్ణారావు కర్షకులను గురించి పద్యాలు రాస్తే ఒక పత్రిక కర్షక జీవితం కవిత్వవస్తువు కాదని విమర్శించి తన అజ్ఞానాన్ని బయట పెట్టుకుంది.

దీనికి విచారపడవలసిం దేమీ లేదు. అగ్రజాతి నాగరికతకీ, సంస్కారానికీ, ఎదురు తిరిగిన రచయితలు సజీవమైన భాషను వాడటానికిగానీ, ప్రజా సామాన్యానికి ఉపకారం చేసే భావాలను వెల్లబుచ్చటానికిగానీ సిగ్గుపడవలసిం దేమీ లేదు. అగ్రజాతి సంస్కారాన్నీ, రాజకీయ విధానాన్నీ, భావాల్నీ, మిగిలిన రచయితలు సక్రమంగా ఎదుర్కొనగలిగినప్పుడే మిగిలిన వర్గాల్లో చైతన్యం కలిగి దాస్యవిమోచనం కలుగుతుంది.

కొంతమంది దిగువవర్గాలకు చెందిన రచయితలుకూడా, పెరిగింది అగ్రజాతిసంస్కారములోనూ, చదివింది అగ్రజాతి చదువూ అవటంవల్ల అగ్రజాతిరచనల్ని అనుకరించటానికి ప్రయత్నిస్తారు. వీరికే చౌదరిగారు 'అగ్రజాతి మానసపుత్రులు' అంటూ వుంటారు. కనక, 'కొంతమంది దిగువవర్గాల రచయితలుకూడా అగ్రజాతి సంస్కారంతోనే పుస్తకాలు రాశారేం!' అని ప్రశ్నించటంలో పసలేదు.

దిగువవర్గాలలోనిరచయితలు కొంతమంది ఈవిధంగావుంటే, సారస్వతం అభివృద్ధిని గ్రహించినవారు కొంతమంది అగ్రజాతిలో వుంటారు. వీరు మిగిలిన వర్గాలభావాలను మిగిలిన వర్గాల భాషలో రాస్తారు. ఇటువంటి రచయితల రచనల్ని కూడా అగ్రజాతి సంస్కారంతో ఫిరాయించిన విమర్శకులు 'శూద్రభాష' వ్రాస్తున్నారనే నిరసిస్తారు.

కాని ఎంత కాలం? కాలానికి కావలసిన రచయితలు వేరు; కాలప్రవాహంలో మునిగిపోయే రచయితలు వారు.

ధనవంతులూ, రాజులూ, ప్రోత్సాహమిచ్చి రత్నాంబరాలిచ్చి, ఆదరించుకోకుండా అగ్రహారాలిచ్చి, దినవెచ్చం పంపించి వ్రాయించిన రచనల్ని మనం చూశాం. అందులో స్వతంత్ర్య లక్షణాలున్నాయా? వారికి తెలియకుండానే, ధనసహాయం చేసిన రాజుల రుచుల కనుకూలంగా వారిని మెప్పించటానికి రాయలేదా? కనుక ఒక వ్యక్తి ప్రోత్సాహంవల్లగానీ, రాజుల ప్రోత్సాహంవల్లగానీ, వచ్చే రచనలవల్ల ప్రయోజనం లేదు. 'రప్పించి మెప్పుమై రత్నాంబరములిచ్చు నొకపతి దొరకైన నొసగవలయు:' అని కోరుకోనక్కర లేదు. ప్రజలే అందుకుపూనుకోవాలి. తమకు కావలసినసారస్వతం తామేనిర్ణయించుకోవాలి. వాటి మంచిచెడ్డలు తామే విమర్శించుకోవాలి. అప్పుడుగాని ప్రజలకు వుపయోగకరమైన సారస్వతం రాదు.

చౌదరిగారు శిష్యులు, వారు వేసిన బాటనే పోతూ, వారికంటే ముందుకు సాగిపోదలచిన మనం అదృష్టవంతులం.

## పంచశిల్పాలు

"ఎందుకు ఏడుస్తున్నావు? వివాహం చేసుకోబోతున్నావా? స్త్రీవైనా బాగుండిపోయేది! ఈ అక్షింతలు నీ పాదాల దగ్గరఉన్న నామీదపడి నన్ను చికిముద్ద చెయ్యకుండా, ఎక్కడో ఎక్కడో పడి చిందిపోయేవి! ఏ దేవతవు?'' అని అడిగింది పిచ్చుక.

"నేను బ్రతికివున్న రోజుల్లో రాజాధిరాజును...మహారాజును,'' అని వెక్కివెక్కి ఏడ్వటం మొదలుపెట్టిందా శిలా విగ్రహం.

"బ్రతికి ఉన్న రోజుల్లో మహారాజులందరూ, మరణించిన తరువాత ఇట్లా ఏడుస్తూ కూర్చుంటారా? యుద్ధంలో మరణించిన రాజులకు వీరస్వర్గం! మహారాజుగా మరణించినవారికి ఘోర నరకం!! అంతేనా?' అని అడిగిందా పిచ్చుక ఆశ్చర్యంతో.

"అవును?'' కన్నీరుతుడుచుకొని మాట్లాడిందా విగ్రహం. మహారాజులంటే ఏమనుకొన్నావు? అంతఃపురంలో కాలంగడిపే అసూర్యంపశ్యలు...ఉదయం మిత్రులతో ఉద్యాన వనంలో షికారు, సాయంకాలం చల్లగాలిలో ప్రియురాండ్రతో వన విహారం, వెన్నెలరాత్రులలో సురాపానం, నృత్యవిశేషాలు... ...జీవితమంతా నేనీవిధంగా గడిపాను. విషయవాంఛల్లో చిక్కి హృదయదౌర్బల్యంచేత నేనురాజ్యాంగంలో ఏమాత్రం జోక్యం కలిగించుకోక పోవటంవల్ల ప్రజలునన్ను కన్నతండ్రిలా చూచుకునేవారు. దుర్బలులను పొగడటం, శక్తిమంతులను

సహించలేకపోవటం వాళ్ళ స్వభావం. అందుకనే నేను మర ణించిన తరువాత నా ప్రాణాలను ఈ శిలావిగ్రహంలోకి పోసి, నన్ను ఉన్నతస్థానాన ప్రతిష్ఠించారు. ప్రపంచాన్ని నిజస్థితిలో నేనిప్పుడు చూడగల్గుతున్నాను. అది అసహ్యమయం! ప్రజల కన్నీ కష్టాలే!! వాటిని చూడలేకున్నా. పిచ్చుకా, నా హృదయం సీసములో చేయబడ్డా కరిగిపోతుంది."

నీవేమి చూడగల్గుతున్నావు?" అని ప్రశ్నించింది పిచ్చుక ఎగిరి ఆ శిలావిగ్రహం భుజంమీద వాలి, కూచొని.

"అదిగో దూరంగా ఆ పేటలో ఒక పూరిల్లున్నది. దానిలో ఒక యువకుడు శుష్కావయవాలతో, జీర్ణాంబరాలతో ప్రొద్దు పుచ్చుతున్నాడు. అతడు కవి, విమర్శకుడు, నటుడు. అతడు కళకోసం ధనమును ఆర్జించుకొని సుఖపడే అవకాశాలను తన్ని వేసి, దేశంకోసం ఆ పద్ధతులు పనికిరావని నిరసించి, తన కళ మునే నమ్ముకున్నాడు. కాని ఈ దరిద్రదేశం దుష్టులను తన అంకంలో చేర్చుకుంటుంది గాని, మేధావులను అక్కుంచేసుకో లేకపోగా, సహించలేదు కూడాను. తినుటకు తిండిలేక అతని తేజోవంతములయిన నేత్రములు కుంచుకొనిపోతున్నాయి. అతని విశాలమయిన ఫాలభాగము అప్పుడేముడుతలు పడిపోయింది... నేడతడు ఉదరపోషణార్థం ఒక పుస్తకం వ్రాస్తున్నాడు. కాని దానిని పూర్తిచేయుటకు అతనిలో జవసత్వాలు లేవు...దీప ములో చమురులేదు, చేతిలో చిల్లిగవ్వయినా లేదు...చేయు నది లేక అతడు నిరాశాపూరితుడై తలను చేతులలో ఇరికించు కొని విలపిస్తున్నాడు. పిచ్చుకా! నా హృదయం నీరైపో తోంది కాని నేను కదలలేను. నా కత్తిలోని ఈ ముత్యమును

తీసుకొంపోయి అతనికివ్వు — ప్రాణముంటుంది."

"వారం రోజుల క్రితమే నా మిత్రులందరూ ఈజిప్టు దేశం వెళ్ళారు. వాళ్ళు నాకోసం ఎదురు చూస్తూ ఉంటారు. నైలు నదిలో ఈతలాడి, పిరమిడ్ల దగ్గర తిరిగి, తామరపూవులతో సరసాలాడుతూ సుఖంగా కాలం గడుపుతూ ఉంటారు. నేనక్కడికి పోవాలి... వెంటనే పోవాలి," అన్నది పిచ్చుక.

"పిచ్చుకా, పిచ్చుకా!! నేను చెప్పినట్లు చెయ్యి. అతను క్షుద్బాధను ఓర్చుకోలేక మూర్ఛపోయాడు."

"సరే, నేటికి నా ప్రయాణం ఆగిపోయింది. ఈరాత్రి నీతో వుండి నీవు చెప్పినట్లు చేస్తాను."

శిలావిగ్రహం సంతోషించింది... చల్లని చూపులతో తన కృతజ్ఞతను వెల్లడించింది.

పిచ్చుక ఆ ముత్యమును ముక్కుతో కరచుకొనిపోయింది. ప్రేమికీ ప్రేమికులు తొంగిచూశారు. ఈ బాహ్యప్రపంచాన్నే మరచిపోయిన స్వార్థపరులువారు. వారిద్దరి ప్రేమమధ్య ఎందరు జీవులు హతమౌతున్నారో ఆలోచించుకోరు. సుఖం కొరకు ప్రేమిస్తారు; ఆ సుఖమును పొందుటకు ఎట్టి కష్టముల నయినా ఢీకొంటారు; ఎందరినయినా నాశనం చేస్తారు. ధనార్జనాపరులూ ఇంతే. కాని 'వారిది పవిత్రప్రేమ, వీరిది స్వార్థం,' అంటుంది ప్రపంచం.

పిచ్చుక వీరివంకయినా చూడకుండా పోయింది. పగలు సంపాదించుకున్న ధనమును భేదాభిప్రాయాలుపడి, భాగించుకోలేక పోట్లాడుకునే వర్తకులను తొంగిచూచి పోయింది. రాజ

సౌధాలను దాటిపోయింది. దేవాలయాలమీాదుగా ఎగిరిపో యింది. చివరికి ఆ కవి గృహం ప్రవేశించింది. సొమ్మసిలి పడి వున్న అతని ప్రక్కనే ముత్యము నుంచి, నెమ్మదిగా తన రెక్కలతో అతనికి విసిరి ఎగిరిపోయింది.

అతడు సేద దేరి ఆ ముత్యమును చూచి, "జ్ఞానసూర్యు డుదయిస్తున్నాడు. అప్పటికప్పుడే అతని కిరణములు తమ పనిని నిర్వర్తిస్తున్నాయి. ఇంక ఈ అంధకారం ఎంతసేపో ఉండదు. ఆహా!" అని సంతోషించి, ద్విగుణీకృతోత్సాహంతో పుస్తకమును పూర్తి జేయ పూనుకున్నాడు.

## 2

మరుసటి నాడు పిచ్చుక ఊరుపట్టుకొని తిరిగింది, కనుపించిన ప్రతి నదిలోనూ స్నానం చేసింది. చింతచెట్టు చిటారు కొమ్మన కూర్చొని తనలో తాను తలతో లయ వేస్తూ పాడుకుంది. చూచినవాళ్ళందరూ "భలే పిచ్చుక!" అన్నారు...

చంద్రోదయం కాగానే శిలావిగ్రహందగ్గరకువచ్చి, "నే నిప్పుడు ఈజిప్టు పోతున్నాను. ఏమయినా కబుర్లున్నాయా?" అని అడిగింది.

"పిచ్చుకా ఈరాత్రికూడా ఉండు," అని ప్రార్థించిం దా విగ్రహం.

"వీల్లేదు"

"అదిగో ఆ ఇంట్లో ఒక స్త్రీ నిద్రాహారాలు లేకుండా విలపిస్తోంది. 'కొడుకా!' అని అన్న ఆమె నోటికి మాట లేదు. ఆమె ఏకైక పుత్రుడు సోషలిస్టు అగుటవల్ల ప్రభుత్వమునకు,

ప్రజలకూ పనికిరాకుండా పోయాడు. ప్రభుత్వము అతని చర్యలు ఉపద్రవము లైనవని భయపడి అతనికి కఠినశిక్ష విధించింది. ప్రజలు అతని సిద్ధాంతములు అపాయకరములని నిరసించి అతనిని పైకి రానియ్యకుండా అణగద్రొక్కారు. తన శరీరమును మాతృదేవికి అర్పించి, తన ప్రాణములను అరచేతిలో పెట్టుకొని దేశముకొరకు పాటుపడి ఆ వీరుడు నేడు క్షయ వ్యాధితో బాధపడుతున్నాడు. మరి ఈ ప్రజలు అప్పటికప్పుడే అతనిని మరచిపోతున్నారు "చేతులారా చేసుకొన్నదానికి అనుభవిస్తున్నాడు," అని చెప్పే వేదాంతులుకూడా బయలుదేరుతున్నారు, అతడు చేసిన త్యాగమునకు, దేశసేవకు, అతని మాతృదేవిని పోషించు బాధ్యతను వహించు బుద్ధిమంతు నీ దేశంలో లేరు. ఆమె తినుటకు తిండిలేక కట్టుటకు గుడ్డలేక కన్న పుత్రుని తలచుకొని ఏడుస్తోంది."

"నే నీ రాత్రి నీతో ఉండి నీవు చెప్పినపని చేస్తాను. కాని ఇక నీదగ్గర ముత్యాలు లేవే! ముత్యాలు లేనివాడు ఇతరుల కష్టములను చూచి మనోవ్యధపాలయి ఏమి ప్రయోజనం?"

"పిచ్చుకా! నా నేత్రాలను ముత్యాలతో చేశారీ మూర్ఖులు. అందులో ఒకదానిని తీసుకొనిపోయి ఆమెకివ్వు."

"ఎంతమాట! ఎంతఘోరం!! అంతపని నేను చెయ్యలేను. ఎన్నటికీ చెయ్యను," అన్నదా పిచ్చుక కంట తడి పెట్టుకొని.

"పిచ్చుకా, పిచ్చుకా, నేను చెప్పినట్లు చెయ్యి?"

పిచ్చుక మాట్లాడకుండా ఆవిగ్రహం కన్ను ముక్కుతో పీకి, తీసుకొనిపోయి ఆమెకు ఇచ్చివచ్చింది. "నా కుమారుని

స్వార్థత్యాగమునకు మెచ్చి ఎవ్వరో ఇంపావర”ని అనుకున్నదామె.

## 3

మరుదినమంతా పిచ్చుక పరధ్యానంగా తిరిగింది.... ఆంబోతున పడ్డది. చీకటిపడగానే శిలావిగ్రహం దగ్గరకువచ్చి, “సెలవు తీసుకొనుటకు వచ్చా”నని చెప్పింది.

“పిచ్చుకా, పిచ్చుకా, నాతో ఈ రాత్రికూడా ఉంటవా?” అని కోరింది శిలావిగ్రహం.

“సరేను.”

“అక్కడ ఒక యువతి కుమిలికుమిలి ఏడుస్తోంది. మనసార బిగ్గరగా దుఃఖించే భాగ్యమునకుకూడా ఆమె నోచుకోలేదు. అకారణంగా ఆమెను భర్త వదలివేశాడు. ఆతడు ఇంకొక కెను వివాహమాడి కులుకుతున్నాడు. కాని సంఘం ఈమెను గుప్పెటలో ఇరికించుకొని పుణ్యం, స్వర్గం అనే ఆశలు గలిగించి నలిపినలిపి బాధపెడుతోంది. ఆ సుకుమార హృదయం బాధకు తాళలేక అల్లడితల్లడై పోతోంది. భరించవలసినవాడే వదలివేయటంవల్ల కన్నవారుకూడా ఆమెను నీచంగా చూస్తున్నారు. భావకవులు ఆమెమీద పద్యాలు వ్రాసి పేరు గడించుకుంటున్నారు. వారు భావకవులు కాదు—స్వార్థపరులు. వారిలో ఎవ్వరూ ఆమెను కాపాడుటకు ప్రయత్నించరు; ఆమె అపూర్వ సౌందర్యం అరణ్యంలోని సుమమువలె; సముద్రంలోని ముత్యంవలె, ఊరికే పోతోంది. పిచ్చుకా! నేనిది భరించలేను; నా రెండో కన్ను తీసుకొనిపోయి ఆమె కివ్వు. ఆ ధనంతో

ఎక్కడికయినా లేచిపోయి సుఖపడుతుం దామె?"

"నేను చచ్చినా ఈపని చేయను. నీవు అంధుడవై పోతావు."

"పిచ్చుకా! పిచ్చుకా!! నేను చెప్పినట్లు చెయ్యి. అందుకే ధర్మాలు చేసేది! ఈ లోకమును నేను ఒంటికంటితో తిలకించలేను."

ఆ పిచ్చుక అతని రెండో కంటినీ ఆమె కిచ్చివచ్చింది.

4

ఇప్పుడు నీ వంధుడవు. నేను నిన్ను ఈ స్థితిలో వదలిపోలేను. కనుక ఇక్కడే కాలక్షేపం చేస్తాను. నీకు కాలం గడచుటకు వినసొంపయిన కథలు చెబుతాను."

'పిచ్చుకా నాకు కథలు వొద్దు. నా రాజ్యమంతా చూచి అందలి ప్రజ లనుభవించే కష్టములను నాకు వినిపించు. ఈ ప్రపంచంలో కష్టములకన్నా వేరు కథలు లేవు."

ఆ పిచ్చుక పగలంతా ఊరూరా తిరిగి తాను చూచిన విశేషములను రాత్రులు ఆ విగ్రహానికి చెప్పేది. కష్టంలోవున్న వారికి ఆ విగ్రహము తన శరీరంమీదన బంగారమును ఒలిచి పిచ్చుక ద్వారా పంపేది. కాని కొన్నాళ్ళకు ఆ విగ్రహం యొక్క బంగారు తొడుగు అయిపోయింది. మంచులో వుండలేక, తిండిలేక, పిచ్చుక మరణావస్థకు వచ్చింది. ఒకరోజు విగ్రహంతో "రాజా, నేను పోతున్నాను!" అన్నది.

"మంచిది పిచ్చుకా. ఇప్పుడు వెళ్ళు. నిన్ను నేను చాలా రోజులు ఆపాను. నా బంగారంతోపాటు నే నీ లోకంలో చేయగలపని అయిపోయింది. పిచ్చుకా! ఇప్పుడు వెళ్లి నీ మిత్రులతో హాయిగా కాల గడుపు!"

"ఈజిప్టేమికర్మ! నేను పరలోకమునకే పోతున్నాను. కాని నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. వెళ్ళబోయే ముందు ఒక్కసారి ముద్దుపెట్టుకోనివ్వు." అన్నది పిచ్చుక.

"పిచ్చుకా, పెదిమలమీద ముద్దుపెట్టుకో!" అన్నాడు రాజు.

అలాగే ముద్దుపెట్టుకొని, ప్రాణములు వదలి, విగ్రహం పాదాలమీద పడింది పిచ్చుక. ఆ శిలావిగ్రహంలో ఏదో రెండుగా పగిలిన ధ్వని.... దాని హృదయం బ్రద్దలయింది.

[ఆస్కార్ వైల్డ్ ఈ కథకు భిక్ష పెట్టాడు]

## భయం

జ్ఞానం అంటే కొందరికి భయం.

ఒకరోజు, ఒక ఆశ్రమవాసితో నాస్తికవాదాన్ని గురించి నేను మాట్లాడటం సంభవించింది. ఆతనికి చదువురాదుగాని అనుభవంవల్ల చాలా వేదాంతజ్ఞానం సంపాదించాడని ప్రతీతి.

అతడు నేను చెప్పింది విని విని ఇలా అన్నాడు. "ఈరోజు మొదలుకొని నేను మీతో మాట్లాడను."

"ఎందుకని?" — నేను ఆశ్చర్యంగా అడిగాను.

"పూర్తిగా చదువులేని రోజుల్లో నాకు ప్రతిరాత్రీ దేవుడు, ఏడుకొండల వేంకటేశ్వరుని రూపంలో, కిర్రు చెప్పులతో పంగనామాలతో కనిపిస్తూ వుండేవాడు. తర్వాత నేను భారత భాగవతాలూ, భగవద్గీత వింటూ వుండేవాణ్ణి. అప్పుడు దేవుడు రాత్రికొక రకంగా కనిపించేవాడు. ఇక పెద్దపెద్ద వేదాంతచర్చలు విన్నతరువాత దేవుడు ఆకారంలేని ఒక పెద్ద సుద్దగా, కనిపిస్తున్నాడు. ఇప్పుడు మీతో ఎక్కువ మాట్లాడితే, ఈ సుద్దకూడా కనిపించకుండా పోతుందేమో అని భయం," అని చివుక్కున లేచిపోయాడు.

# ఏం కావాలి?

మనకు ఏం కావాలి? అనే ప్రశ్నకు సరైన జవాబు ఒక్కటే-విప్లవం. మన దేశం అభివృద్ధి చెందాలంటే విప్లవం కావాలి.

విప్లవం కలగాలంటే ముందుగా ప్రజకు భూత వర్తమాన కాలాలమీద అసంతృప్తి కలగాలి. ప్రస్తుత పరిస్థితులతో తృప్తిపొంది బొజ్జ నిమురుకునే సంఘం విప్లవం చెయ్యలేదు. విప్లవం అవసరమే దానికి కనిపించదు. ఇక తన పూర్వచరిత్రనూ, పూర్వ ఔన్నత్యాన్నీ, పొగుడుకుంటూ లొట్టలు వేసుకునే సంఘం—ఇంతకంటే అన్యాయం.

ఇప్పటికి మనలో కొందరికి మానవశక్తిమీదే నమ్మకంలేదు. అంతా భగవంతుడే నిర్ణయిస్తాడనీ, ప్రపంచం ఆ నిర్ణయాలమీద నడుచుకుంటుందనీ వీరి నమ్మకం. ఇలాంటి వ్యక్తులను దాస్యంలోనుంచి, దారిద్ర్యంలోనుంచి. ఘోరఅవస్థల్లోనుంచి, సనాతన భావాల్లోనుంచి తప్పించటం విప్లవవాదులు చెయ్యవలసినపని.

విప్లవం అవసరాన్నిబట్టి జరిగేమాట నిజమే! కాని దానిని ఉపయోగించుకొని ప్రజలను సరైనదారిలో నడిపించే నాయకత్వంలేందే జయప్రదంకాలేదు. లేకపోతే తప్పుదారిపట్టి అగమ్యగోచరం అవుతుంది. విప్లవశక్తులు చిందరవందరై నాశనమవుతాని.

ప్రజల్లో పూర్వభావాలకూ, సనాతనాచారాలకూ, ఆధ్యాత్మిక గీర్వాణానికీ పలుకుబడి వున్నంత కాలం విప్లవంరాదు. వీటిమీద అసహ్యం కలిగించి, వీటిని రూపుమాపి, ముందు సంఘాన్ని భావదాస్యంనుంచి తొలిగిస్తే విప్లవ నాయకత్వమూ వొస్తుంది—విప్లవమూ జయప్రదంగా జరుగుతుంది.

కల్యాణీ ప్రెస్, తెనాలి.

# గోపీచంద్ గారి కథలు

## అభిప్రాయాలు

### 'ఆంధ్ర ప్రభ'

"దేశం ఏమయ్యేట్టు" కథాసంపుటిలో శ్రీ గోపీచంద్ గారి కథారచనా ప్రతిభ అధికంగా ప్రస్ఫుటమైంది. ఇటీవల ఒక కొత్త టెక్నిక్ ఉపయోగంలోకి వచ్చింది. దీని ప్రకారం కథకు "క్లయిమాక్స్" విధిగా ఉండనక్కర్లేదు. శ్రీ గోపీచంద్ గారు తమ ఈ కొత్త కథాసంపుటిలో ఈ కొత్త టెక్నిక్ నే పూర్తిగా అనుసరించారు. అంతేకాక, ఈ కొత్త టెక్నిక్ అంటే అభిమానంలేని ఈసమీక్షకునికి సయితం "ఇది ఆదరణీయమే!" అనే అభిప్రాయాన్ని కలిగించారు.

"ధర్మవడ్డీ", "ఇలా జరిగేను" : శ్రీ గోపీచంద్ గారి కొత్త కథాసంపుటిలోని ఈ రెండు రచనలు అత్యుత్తమంగా వున్నై. అంతటి చేవగల కథలు మన భాషలో లేవనడంలో అత్యుక్తి ఈషణ్మాత్రమైనా లేదు.

కథారచనపట్ల ఆసక్తిగలవారందరూ శ్రీ గోపీచంద్ గారి కథాసంపుటాల్ని శ్రద్ధతో చదివితీరాలి.

### 'సుకుమార్'

...చెప్పవలసినది చప్పన, టూకీగా, తిన్నగా చెప్పగలడు గోపీచంద్. అంతేగాక తను కథ చెబుతున్నాను, తను చెప్పే కథ ఎవరో వింటున్నారు అనే ధోరణి లేదు గోపీచంద్ కి. ఈ ఒక్కగుణమే చాలు — ఈయన వ్రాసిన కథలని, యితర గొప్ప తెలుగు రచయితల కథలనుంచి ప్రత్యేకపరుస్తుంది.

### 'ఢంకా'

ప్రతి కథా చదవడానికి ఎంతో ఇంపుగా వుంది. భారత జాతీయ పురాతన ఛాందస మతాచారాలు మటుమాయం కావాలంటే గోపీచంద్ గారి రచనలన్నీ చదివి తీరాలి.

### 'రాడికల్'

...లక్షణయుతమైన చిన్న కథలు వ్రాయటంలో వీరు సిద్ధహస్తులు. రానున్న సంఘపరిణామంలో సాహిత్యం ఎట్లావుండాలో అన్నది గోపీచంద్ గారు యీనాడే, వైతాళికులై చూపిస్తున్నారు.

ఈ కథల సంపుటి, సామాన్య పాఠకుల సంగతి అటుంచి, కథకులం అనుకొంటూ తిరిగే రచయితలు మాత్రం తప్పకుండా చదువుకోవాలి. మనకు ఎలాంటి కథలు కావాలో యిప్పటికైనా మన రచయితలు గోపీచంద్ గారినించి నేర్చుకోవాలి.

---

గోపీచంద్, సూతాశ్రమం, తెనాలి.

# రేడియో ప్రసంగాలు

## ఉభయకుశలోపరి

### 'దేశాభిమాని'

సాగు చేస్తున్న ప్రతిరైతూ, పల్లెటూరిని వర్ణించబోయే ప్రతి కవీ, ప్రతి కథకుడూ, ఒక్కసారి ఈ ఉభయకుశలోపరిని తిరగవేస్తారని మా సలహా, విశ్వాసమున్నూ.

### 'ఆంధ్ర వార పత్రిక'

ఈ ప్రసంగకర్త భాష, రచనా ప్రణాళికలోని సంయమమూ— అన్నీ ఈ రచయితకు భద్రప్రస్థానాన్ని చేకూర్చేట్టున్నవి.

ఈ ప్రసంగాలు విన్నవారినికూడా, చదువుకోటానికి ఊరించే సత్తువ కలిగివున్నవి.

### 'కృష్ణా పత్రిక'

గోపీచంద్ గారు తెలుగులోకానికి సుపరిచితులైన యువకులు, కథకులు, వ్యాసకర్తలు—పల్లెటూరి ప్రజా జీవితాలకు సంబంధించిన సన్నివేశాలను, సంఘటనలను వీరు చక్కగా చిత్రించగల కవులు.

ఈ పుస్తకం—ఉభయకుశలోపరి—అందరూ చదవతగిన పుస్తకం. అధోగతిలోపడి పోతున్న పల్లెటూరివాసులు తప్పక చదువవలసిన పుస్తకం.

### 'ఆంధ్రా లేబర్'

ఈ పుస్తకంలో గోపీచంద్ గారు పల్లెజీవితాన్ని చక్కగా చిత్రించారు.

పల్లెటూళ్ళ దౌర్భాగ్యానికంతకూ ఆర్థికస్థితే మూలకారణమని తెలుసుకోలేక 'గ్రామపునరుద్ధరణ' 'గ్రామపునరుద్ధరణ' అని గోలచేసే ఘనులంతా ఈ పుస్తకం చదవటం చాలా అవసరం.

### 'రాడికల్'

కథల్లో సమాజాన్ని రియలిస్టిక్ గా చిత్రించటంలో గోపీచంద్ గారు యిదివరకే ప్రసిద్ధికెక్కారు. తమ రేడియో ప్రసంగాల్లో మరో కొత్తపంథాలో పల్లెటూరి జీవితాన్ని, రైతు సంస్కారాన్ని చక్కగా వర్ణించారు.

ప్రజానీకం, ముఖ్యంగా పల్లెటూరి ప్రజలు, చదవవలసిన పుస్తకం విప్లవం చెయ్యాలనుకున్నవారు విధిగా చదవాలి.

## జ్యోతిష్మతీ పబ్లికేషన్స్

పి. వి. సుబ్బారావు, బి. ఎ.

| | |
|---|---|
| రష్యావిప్లవం ... | 1-4-0 |
| ఎం. ఎన్. రాయ్ జీవితం | 1-0-0 |

గోపీచంద్, బి. ఎ., బి. యల్.

| | |
|---|---|
| ?రాయణం | 1-0-0 |
| ?నుష్యేటట్లు | 1-0-0 |
| ? | 1-0-0 |

జి. వి. కృష్ణారావు, బి. ఎ.

| | |
|---|---|
| కావ్యజగత్తు | 1-0-0 |
| యుగసంధ్య | 1-0-0 |
| ?వర్గశిఖరాలు | 1-0-0 |

కె. రాధాకృష్ణమూర్తి, బి. ఎ.

| | |
|---|---|
| ?ప?చకథలు | 1-0-0 |
| ?డియాలో విప్లవం | 1-0-0 |
| ?డియా భవిష్యత్తు | 1-0-0 |

బి, నాగరాజు, బి, ఎ., బి. యిడి.

| | |
|---|---|
| ?శాస్త్రీయ రాగసంధ్యారాగం | 1-0-0 |

## అనుబంధాలు

కవిరాజు

| | | |
|---|---|---|
| సూతపురాణం, భాగం | 1. | 1- |
| | 2. | 1- |
| | 3. | 1-0-? |
| సూతాశ్రమగీతాలు | | 0-8-? |
| ఘూర్ణమానవా | | 0-8- |
| కుప్పుస్వామిశతకం | | 0-8- |
| వివాహవిధి | | 0-4-0 |

మిక్కిలినేని భగవంతరావు

| | |
|---|---|
| రైతుబుర్రకథ | 0-10-? |

ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

| | |
|---|---|
| కుందమాల | 0-12-? |
| కవిమాయ | 0-12-? |
| శ్రీ విద్యాశంకరవిజయం | 1-8-? |
| శ్రీ విద్యాశంకరలీల | 2-0-? |
| అమరుకం | 1-0-? |

? పుస్తకములకు :

జ్యోతిష్మతీ పబ్లిషర్స్, తెనాలి.